కుటుంబరాయ శర్మ, మేళ్లచెర్వు

# భక్తవిజయము

నరసారావుపేట, 1914

Record no. 595

Kuṭumbarāya Śarma, Mēḷlacervu

Bhaktavijayamu

Narasārāvupēṭa, 1914

Record no. 595

## Bibliographic Record Target

కుటుంబరాయ శర్మ, మేళ్లచెర్వు.

భక్తవిజయము : అను నామాంతరము గల ప్రహ్లాద భక్తాగ్రేసరునిదివ్యచారిత్రము / ఇది మేళ్లచెర్వు కుటుంబరాయ శర్మచే రచియింపఁబడినది.- 1. కూర్పు.- నరసారావుపేట : భారతీవిలాస ముద్రాక్షరశాల, 1914.

(6), 103, 10, (2) p. ;21 cm.

Record no. 595

Kuṭumbarāya Śarma, Mēḷḷacervu.

Bhaktavijayamu : anu nāmāntaramu gala Prahlāda bhaktāgrēsarunidivyacāritramu / idi Mēḷḷacervu Kuṭumbarāya śarmacē raciyimpam̐baḍinadi.- 1. kūrpu.- Narasārāvupēṭa : Bhāratīvilāsa Mudrākṣaraśāla, 1914.

(6), 103, 10, (2) p. ;21 cm.

Record no. 595

rst Edition B. V. Press, Narasarowpet.

SREE,

# Bhaktha Vijayamu.

(A Telugu Drama in five acts)

By,

Mellacheruvu Kutumbaraya Sarma.

NARASAROWPET



Price Rs. 0—8—0

# శ్రీ భక్తవిజయము





అను

నామాంతరముగల ప్రహ్లాద భక్తాగ్రేసరుని దివ్యచారిత్రము

[అయిదంకముల నూతన నాటకము]

ఇది

మేళ్లచెరువు కుటుంబరాయ శర్మచే
రచియింపఁబడి

మాడిశెట్టి రంగయ్య అండ్ బ్రదర్సు గార్ల
ద్రవ్యసహాయముచే

నరసారావుపేట
భారతీవిలాస ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.

మొదటికూర్పు 500

18—1914





వెల. 0—8—0

శ్రీమత్పరదేవతాపతయేనమః

# విజ్ఞాపన.

—(o)—

ఆర్యులారా!

శ్లో॥ "మందఃకవియశఃప్రార్థీ" అను న్యాయానుసరణంబుగ భాషాభిజ్ఞానమించుకయు లేక మందబుద్ధినై చరించుచుఁ గవియశస్సందగోరి "శ్రీ గంధతరువుచెంతనుండు శ్రీపర్ణికవృక్షంబు మాడ్కి" సజ్జనసాంగత్యముచేతను, గురుశిక్షలేక నేను కొలఁదికాలమునుండి నొక మెంబరుగానుండిన యీపురి విక్టోరియానాటకసంఘమువారు పలుమారు ప్రదర్శించు శతావధానులు, బ్రహ్మశ్రీ తిరుపతి వెంకటేశ్వరకవులు, చిలకమర్తి లక్ష్మీనరసింహకవి మొదలుగాఁగల విద్వద్వరేణ్యులు రచించిననాటకములమాత్రమేఁ [మున్ముందు వారికిమద్వందనములనాచరించి] భక్తిశ్రద్ధలఁబలుమారు పఠించుచుండుటచేతను లభించినస్వల్పజ్ఞానమునకే యుబ్బివీగుచు స్వశక్తి నెంచఁజాలని నేను సాంఘికాభిమానము లేక శ్లాఘాభిమానపిశాచావేశుఁడై నొకరినొకరు నీసడించుకొను నీకాలంబున గ్రంథరచనకుఁ గడంగుటకు కారణము నామూఢత్వమే సుమీ; అయినను సర్వబుధజనవిధేయుఁడనగు నాయందట్టి యసూయనుంచక సోదరభావముచేఁ "దమ్మిఁగ్రమ్ముకొన్న శాఖాపర్ణంబులవిడి, మకరందమునకై వెదకుచుండు పుష్పంధయమ్ము" లట్లు తప్పులవిడనాడి యొప్పులనే గ్రహించి నన్నెంతయు ప్రోత్సాహపరుతురనుగట్టినమ్మకముతో సాహసించి

తిని. అట్లుగాక నసూయనే ప్రధానముగాఁగొని “ బాగైన దేహభాగమును వీడి గాయముల వెదకికొను మక్షికములరీతి నిందసేయనెంచిరేని యాకీర్త్యాపకీర్తులు వారలవేగాని నన్నెంతయు నాపాదించవు. నా గ్రంథరచనకిదియే ప్రథమప్రయత్నమగుట నచిరపరిచితవశంబున తప్పులు కుప్పలుగానుండక మానవు. చదువరులు వాటినెల్ల చక్కఁబడవైచి దయాళులరై నాకుఁ దెలియఁబఱచిన ముందుకూర్పునందు సవరణఁజేసుకొనియెద. ఇట్టులారంభించుటకుఁబూర్వము జ్ఞానసంపాదనార్థమై నేఁజేరిన బుధాగ్రగణ్యుఁడును చతుర్విధకవితానిపుణుఁడును, శతావధానియు కొండవీటిచరితాద్యనేక ప్రబంధకర్తయు మద్గురువరుండునునగు బ్రహ్మశ్రీ మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ గారికిని దోషసంకులంబైన నీగ్రంథము నెట్లుముద్రింపించుదునాయని జంకుచుండఁ దనకసాధ్యమైనంతవరకు సహాయమొనరించి నాకెంతయు మనోదృఢమునుఁ గలుగఁజేసిన నామిత్రులగు శతావధాని బ్రహ్మశ్రీ పెళ్ళూరి శ్రీనివాసరంగేశ్వర శర్మగారికిని బాల్యస్నేహముపాటించి భక్తివిశ్వాసములఁ దనముద్రాక్షరశాలలో స్వల్పకాలంబున ముద్రింపించియొసంగిన బ్రహ్మశ్రీ ప్రత్తిపాటి రామకృష్ణయ్య బ్రదర్సుగారికిని నావినయపూర్వక వందనములాచరించుచున్నాఁడ.

నరసారావుపేట. }
1—3—1914. }

ఇట్లువిన్నవించు
సజ్జనవిధేయుఁడు,
మేళ్ళచెర్వు కుటుంబరాయశర్మ,
గ్రంథకర్త.

# ఈనాటకమునవచ్చు పాత్రములు

## పురుషులు

సూత్రధారుఁడు
మారిషుఁడు
చారుఁడు
హిరణ్యాక్ష్యపుఁడు
విప్రజిత్తి
వక్రదంతుఁడు
నారదుఁడు
వజ్రఘాతకుఁడు
అలంబసుఁడు
మహేంద్రుఁడు
బృహస్పతి
యముఁడు
ప్రహ్లాదుఁడు
చండామార్కులు
బాలురు
పాములవాఁడు

## స్త్రీలు

లీలావతి
దితి

సందర్భానుసారముగ మంత్రికింకరసేవకులు వత్తురు

శ్రీరస్తు

శ్రీహయగ్రీవాయనమః

# వంశానుక్రమనిక

ఉ॥ శ్రీలఁ జెలంగి సాధుజన ♦ సేవితమైతగు స్కాందమందుఁ గా
పాలికనుం వెలుంగుమను ♦ వంశజులన్ ముని వాడికాహ్వయుం
డోలి శపింప వారలు త ♦ దుగ్రత నాల్గువిధంబులై యుమా
లోలు కృపాతిరేకమున ♦ లోకము మెచ్చఁ జెలంగిరుర్వరన్

వ॥ ఆనాల్గుశాఖలేవియనిన

గీ॥ "తెలగానుగాడఁ ♦ దెలకులవారలు
కడిగియాడదేవ ♦ గాండ్లవారు
కడుగ కాడిరేని ♦ కసిగాండ్లవారును
గానుగాడ మఱియు ♦ గాండ్లవారు ॥

గీ॥ అట్టినాల్గింట నొకశాఖ ♦ యైనదేవ
గాండ్లవంశమునం జనఁ ♦ గలిగిరమిత
ద్రవ్యవంతులు బహుమాన ♦ ధనులనంగ
మాడిశెట్టిమహాన్వయ ♦ మాన్యులవని ॥

క॥ ఖ్యాతిగ నావంశంబునఁ
జేతోమోదంబుతోడఁ ♦ జెలువారల స
ద్భూతదయాపరుఁడగు శ్రీ
సీతారామయ యనంగ ♦ శ్రేష్ఠుడు వెలసెన్

ఉ॥ ఆతఁడు పెద్దభార్యయగు ♦ నట్టిసతీమణి శేషమాంబ యం
దాతఁ జిరంగయాఖ్యునిమ ♦ హాత్ముని రామయయన్ గుమారులన్
బ్రీతిని శేషమాంబయన ♦ వెల్గు ద్వితీయకళత్రమందుఁ బ్ర
ఖ్యాతిగఁ గాంచెఁ జల్మయను ♦ నాపయినారయయన్ సుపుత్రులన్

వ॥ ఆపురుష రత్నంబులలో

మ॥ కులశీలంబులఁ ద్రోవదాటక సదా ♦ కోపంబుఁ గ్రౌర్యంబుఁ దాఁ
గలనైనన్ గనకుండ సంతతము వీ ♦ కన్ మిత్రులన్ బోత్రలో
కులనెల్లన్ బహుప్రేమఁ జూచుచును స ♦ ద్గోష్ఠిన్ బ్రవర్తింపుచున్
వెలసెన్ నారయపుణ్యమూర్తి యనుచున్ ♦ వేడ్కన్ బ్రశంసింపగన్

చ॥ సదయుఁడు నారయాహ్వయుఁడు ♦ చాలఁగ కంభపువంశధీరు సౌ
హృదయుఁ డనంతసద్గుణ ధు ♦ రీణుఁ డనందగు రామసామికిన్
ముదముఁ జెలంగునట్టివర ♦ పుత్రికయై విలసిల్లు యాదెమన్
బుధులు నుతింపఁగైకొనె స ♦ ముజ్వలకీర్తిఁ జెలంగనెంతయున్ ॥

వ॥ ఆయాదెమాంబ

మ॥ "పతియే దైవ" మటంచు నెమ్మదిని సం ♦ భావించి సద్భక్తితో
సతతంబున్ బతి పాదసేవలసదా ♦ చారంబుగాఁ జేయుచున్
వితతస్వాంతముతోడ నర్థులమహా ♦ ప్రేమోన్నతిన్ జూచుచున్
క్షితిపై వాసినిఁ గాంచె నాదెమసతీ ♦ శీలంబమోఘంబనన్ ।

సీ॥ ఆతఁడా యాదెమ్మ ♦ యందునఁ గాంచెను
పాండు భూపాలుని ♦ పగదిగాను
వేంకటకృష్ణయ్య ♦ వెనుక రంగయను రా
మస్వామి పెద్దరా ♦ మయను సీత
రామయ్య యనుసుధీ ♦ రమణుల సద్ధర్మ
పరుల విశ్రుతసత్ ♦ ప్రభావయుతలఁ
గోటమ్మ శీతమ్మ ♦ కోర్కెలు మొలకెత్త
నాగమ్మ లక్ష్మమ్మ ♦ నయముగాను

చెలఁగి చిన్నమ్మయు నెసఁగు ♦ శీలమతులఁ
గాంచి సంపత్తి కెక్కఁడు ♦ గాఁగ సిరిని
బడసి సద్వర్తనంబునుఁ ♦ బాయకుండ
ఖ్యాతిగాంచెను ధారుణీ ♦ నసముఁడగుచు ॥

వ॥ ఆకుమారరత్నంబులలో

ఉ॥ రంగయరామసాములు ది ♦ రంబగు బ్రాహ్మణదేవభక్తిచే
తగ నుకీర్తి జెందిరి వసు ♦ ధంబున వారికిసాటియెవ్వరై
నఁగలరేయటంచును ఘ ♦ నంబుగ నెల్లరు సన్నుతింపగా
బంగరమెట్టిదైనను శె ♦ బాసనరేశుఁడు గారవింపరే

సీ॥ ఇతరులనెన్నఁడు ♦ నెత్తిమాట్లాడరు
కఠినంపుమాటలఁ ♦ గసరఁబోరు
ధర్మమార్గముఁదప్ప ♦ దలఁచగాఁదలపోయ
రనృతంబులాడఁగా ♦ నరయఁబోరు
ఉన్న దాననుదృప్తి ♦ నొందుచుండియు లేని
దానికియాశలఁ ♦ దగులఁబోరు
తనవారితోసర్వ ♦ జనములఁదలపోయుఁ
బెడబుద్ధివారిపైఁ ♦ బెట్టఁబోరు
విమలహృదయులుసదయులు విదితయశులు
సుజనవందితులకలంక ♦ సుగుణపరులు
మాననీయులువిబుధస ♦ న్మాన్యులరయ
జగతిరంగయ శ్రీరామ - సామిఘనులు ॥

♦ శ్రీరస్తు ♦

# భక్త విజయము

## నాంది

——:0:——

శ్రీరమణీప్రియుండు బుధ-సేవితుఁడై నిజదాసరక్షణా
గోరుచు మత్స్యరూపమయి కూర్మవరాహములై చెలంగి యుర:
పారనిప్రేమ భక్తవిజ-యంబును జేయగ నారసింహమై
కీరితి నిల్పుకొన్న నర-కేసరి మీకిడుతన్ శుభంబులన్ ॥

(నాంద్యంతంబున)

సూత్ర—— సభాసదులారా! ముందుగ నామనవియొకటి నాలకింపుడు

ఉ॥ భాగవతంబులోన నొక భాగముగాఁ జెలువొందుచుండిన
ద్భాగవతాగ్రగణ్యుని ప్ర-భావముఁ దెల్పెడి భాగమాటచే
"బాగుగ లేదుకైతయని-భావమునందలపోయబోకుడీ
"బాగుగరంగు లేదనెడి-భావనఁ గస్తురి ద్రోసిపుత్తురే

(తెఱవంక జూచి) ఏమిది? వేళమీరినను మారిషుఁడు రాఁడయ్యెను. బావా! అబలలవలె నాభరణంబులఁదగిలించుకొనుచుంటివా? మందునిమాడ్కి-మందయానలతోఁ గాలము వెళ్ళబుచ్చుచుంటివా! నేఁడిదేలయింతతడవు? సభాసదులు కాలహారణమున కోర్వఁజాలరు త్వరితముగ నొకసారిందురమ్ము.

మారీ—— (కోపముతో) ఆఁ! రాకేమి? ఇదేవచ్చుచుంటిని (ప్రవేశించుచును)

సూత్ర— ఆర్యా! రోషభీషణాకలితస్వాంతుఁడవై కను లెఱ్ఱబాఱ, ముఖపుటంబులదుర, సత్యానురక్తిని నాయడుగులకుమడుగులొత్తుఁవాఁడవు నేఁడేలకో "రాకేమి" యనివిరుద్ధముగ మాటలాడుచుఁ దిరస్కారభావమునుఁ గనపఱచుచున్నావు? వెఱ్ఱిపట్టినదా?

మారీ—(పశ్చాత్తాపమున) బావా! క్షమింపుము. నిజముగా నాకు వెఱ్ఱియేపట్టినది. నాకోపముకొలఁది నీమాటజ్ఞప్తి లేక, యెవరోయనుకొని, అట్లువ్యతిరిక్తముగ మాటలాడితి.

సూత్ర— మూఢుఁడా! కోపమెంతచెడ్డదియో తెలియఁజాలవైతివే?

కం॥ కోపమునజెడును మానము।
కోపమునను మిత్రబంధు • గురులకు వెలియౌ।
కోపమున నఘముకూడును।
కోపమునను ప్రాణహాని • గూడగలిగెడిన్॥

కావున కోపమెట్టివారికినుండఁగూడదు. అయినను నీదుడుకుతనమునకు తగుపశ్చాత్తాపబుద్ధి గలిగినదింతయే చాలును వేఱుక్షమాపణవలదు గాని నీకోపకారణమేమైయుండును? నీముఖవైఖరిని వీక్షించ నెవరితోడనో కలహించుచున్నట్లున్నది. అదిపరులతోనైన—

మారీ— పరులతో వైరమేలకలుగును? కల్గినను కోపమువచ్చునా? వచ్చినను తన్నుమంచినవారిపై రాదుగదా? ఒక వేళవచ్చినను నిష్ప్రయోజనమని యెఱుఁగరా? యీమామగారితోడనే.

సూత్ర— ద్రోహీ! తండ్రిగారితోడనే తగవులాడుచుంటివా? ఏమి నీబుద్ధికుశలత.



కం॥ తండ్రియెధనమును ప్రాణము।
తండ్రియెబాంధవుఁడు హితుఁడు • దలపోయంగాఁ।
దండ్రియెగురుఁడును దైవము।
తండ్రికిసమమైనవారు • ధరణిన్ గలరే॥

అని సర్వశాస్త్రములు నుడువుచుండ నీకేల దెలియదయ్యె? నీవిద్యావినయసంపత్తి కిదియాఫలము? కానిమ్ము గతించినదానికి చింతించుట గతజలసేతుబంధనము గాని కలహకారణమేమి?

మారి— కారణమా? తెల్పెదవినుము. రాత్రిమాధవసన్నిధానమున జరుగు హరికథాకాలక్షేపమున కరుగుటచే వీరశైవుఁడగు మాతండ్రిగారు కోపించిరి. అదియే కలహకారణము.

సూత్ర— జడుఁడా! కులాచారధర్మంబులదాటి నడువరాదని బుద్ధిజెప్పు తండ్రిగారితోడనే తగవులాడెదు నీకునేనొక్కలెక్కలోనివాఁడనా? గుడినేమ్రింగువానికి తల్పులనెంత?

మారి— ఆర్యా! ఏమిమాటలు కులమా? ఆచారమా? ఎక్కడి సుద్దులు? ఎవరిబుద్ధికేదిరుచించునో, ఆదారినేపోవలయుననెడి పురాణగాథవినియుండలేదా?

చ॥ మునుపు హిరణ్యకశ్యపుని • ముద్దులపట్టిఁడు విష్ణుభక్తినే
మనమునఁబాదుకొల్పి మొగి • మాటలుఁబోనిడితండ్రియాజ్ఞలన్
వినక సుఖంబులన్ దొలఁగి • పెక్కుశ్రమల్ బడి యాత్మబుద్ధిచే
గొనఁడొకొ స్వర్గసౌఖ్యముల • కోర్కెలునిండ జగంబు మెచ్చఁగన్

సూత్ర— సరే చాలు చాలు నీవిదాధిక్యత.

ఆ॥ వె॥ పరమభక్తుఁడైన • ప్రహ్లాదుతో నీవు।
పోల్చిచెప్పుకొంట • పొసగుటెట్లు
సింగమునకు పాటి • జెప్పంగవచ్చునే

జాగిలంబునదిక ♦ శౌర్యపటిమ ॥

ఇదియంతయు విరివిగ విద్యాపరిశ్రమలేకపోవుటచే సంభవించెను. నీకింక నువిద్యాకృషి యవసరమైయున్నది. ఆధర్మోపన్యాసములు తదుపరి చెప్పెదనుగాని మనప్రస్తుతకార్యము జ్ఞప్తికివచ్చినదా?

మారి— ఆర్యా! మనప్రస్తుతకార్యమేమి? ఈసభాసదుల యాగమన మెందులకు?

సూత్ర— ప్రమత్తుడా! నేడు నరసారావుపేట విక్టోరియానాటకసంఘమువారి ప్రకటననైన వినవైతివో?

మారి— నావితర్కములో నేనుండిచక్కగనాలకించనైతిని. ఏదేని నాటకఖేలనా ప్రకటనయేనా?

సూత్ర— ఔను.

మారి— ఏనాటకప్రదర్శమున వీరలమనసు రంజింపఁజేయనెంచిరో యానతిచ్చెదరా!

సూత్ర— భక్తిరసప్రధానంబును, ఇహపరసాధనంబుననగు భక్తవిజయమను నామాంతరముగల ప్రహ్లాదభక్తాగ్రేసరుని చరితము.

మారి— (ఆలోచించును)

సూత్ర— ఏమట్లుయోచించెదవు.

మారి— బావా! మరేమియులేదు నేడుప్రత్యక్షప్రహ్లాదచరిత్రజరిగెఁగదాయని నాచరితమునుగూర్చి నేసిగ్గుపడుచుంటిని. దానికేమి? గ్రంథకర్తయెవరు.

సూత్ర— చెప్పెదనువినుము.



తే॥ గీ॥ కొండవీటిచరిత్రంబుఁ ♦ గూర్చినట్టి ।
శ్రీ గురుబ్రహ్మకవి ముఖ్య ♦ శిష్యవరుఁడు ।
మేళ్ళచెర్వు వెంకటరామ ♦ మేటికొమరుఁ ।
డైనయట్టికుటుంబరా ♦ యాహ్వయుండు ।

చ॥ పరహితకార్య తత్పరులు-పండితసన్నుతకీర్తికాములై
బరగెడి మాడిశెట్టికుల-వారధిచంద్రులు నారయాఖ్యధీ
వరసుతులై చెలంగు గుణ-వంతులు రంగయరామసామియా
దరమున జేసియీసుచరి-తంబురచించెబుధుల్ నుతింపగన్ ॥

మారి— అయ్యా! వీరెవ్వరు?

సూత్ర— గ్రంథకర్తయొక్క బాల్యమిత్రులు, సద్వర్తనులు, కీర్తికాములు, ధనవంతులు, వ్యాపారులు. వారిప్రోత్సాహముచేతనే గ్రంథకర్త దీనినిరచించెను.

మారి— సరేగాని! ఈబాలకవియొక్క వచ్చిరానిమాటలను సభ్యులుమెచ్చెదరా?

సూత్ర— ఏలమెచ్చుకొనరు? అయినను వారలను కవియిట్లు వేడుకొనియేయున్నాడు. ఏమన, సోకవిశ్రేష్ఠులారా!

గీ॥ బాల్యచాపల్యముఁనఁజేసి ♦ బాగునోగుఁ
దలపకిబలిఁబూనితి ♦ దయనుగనుఁడి
యెల్లభారంబుమీపయిఁ ♦ నిడినవాఁడ
పుత్రవాత్సల్యముననన్ను ♦ బ్రోవరయ్య ॥

అట్లుగాకఁ నసూయయేప్రధానముగా గొనునోకవిశ్రేష్ఠులారా!

గీ॥ అన్నలార! మీకీరితి ♦ యందులోన
తరుగుపడునని నిరసింపఁ ♦ దలపవలదు

తమ్ముఁడుండినభాగంబు ♦ తలుగుననుచు
విసమునిడఁజూచు సోదరు ♦ విధముగాను

మారి—— పండితశ్రేష్ఠా! తమ్మునికివిసముఁబెట్టఁగఁజూచు దుర్మార్గు లుండిరా?

సూత్ర—— లేకేమి? కలికాలముగాదా?

మారి—— (చెవులుమూసుకొని) శ్రీహరి! హరీ! ఎంతమాట.

(తెఱలో)

తెఱలో—— ఆఁ! దురాత్మా! వైరినామోచ్చారణభేషజా! ఏమనుచుంటివి? ఏమియీకాలమహిమ.

మ॥ ఖలుఁడై శ్రీహరియంచుబల్కెనెవఁడో ♦ కష్టాత్ముఁడీవీటయా
తులువన్ బట్టి వధించియంగములనే ♦ తోరంబుగాగ్రుచ్చి, వా
కిలియందున్ వడిగట్టకున్నయెడ నా ♦ కీర్తిన్ దగన్ గాల్పనే
యిలనాప్రాణములున్న నేమిఫలమా ♦ నికార్యమున్ జేయమిన్॥

మారి—— (వణకుచు) ఆర్యా! రక్షింపుము రక్షింపుము పిడుగుఁబోలినయీనుడి యెవ్వరిదైయుండును! మనమెవరికే యపకారముఁజేసితిమి?

సూత్ర—— మిత్రమా! భయపడకుము మనమేయపకారమునుఁజేయకున్ననేమి? దుర్మార్గులకధికారమిచ్చిన సాధులనుబాధింపఁ జూచుచుందురు. అదివారియధికారగర్వము. పాపపరిహారార్థమై నీవనిన “హరి హరి”యను పలుకులాలించి, హిరణ్యకశ్యపుని యనుచరుఁడొకఁడు రోషభీషణాయత్తచిత్తుఁడై యిటువచ్చుచున్నాఁడు; మనలఁగని “హరిభక్తులమే” యని యెట్టిసిలుగులబెట్టునో? మనమిందుండరాదు. పోదమురమ్ము.

(నిష్క్రమించుచున్నారు)

—: ఇది ప్రస్తావన: —

# భక్త విజయము



## ప్రథమాంకము.



### [ప్రథమ — రంగము]



(చారుఁడు పటాటోపముగాఁబ్రవేసించుచున్నాఁడు)

చారుఁడు—— ఓరోరి! దురాత్మా! వైరినామోచ్చారణభేషజా! ఏమనుచుంటివి? ఔరా కాలమహిమ!

మ॥ ఖలుఁడై శ్రీహరియంచు &c. (అను పూర్వోక్తపద్యమును చదువుచు)

ఎవ్వఁడును లేఁడే? ఓరోరి! పిరికిపందా!

చ॥ చాటునడాగియుండి విన ♦ శక్యముగాని హరిప్రలాపముల్
మాటికిమాటికీ పగిది ♦ మైమఱపొంది విమూఢచిత్తుఁడై
నోటికివచ్చినట్లు మది ♦ నెవ్వఁగ బల్కుచునున్నవాఁడుమా
పోటునకున్ ధరన్ గెడిసి ♦ పోవుటకేగద నిట్టులాడుటల్ ॥

అఖండభుజబలోద్దీపితులును త్రిలోకజేగీయమానశౌర్యధుర్యులునునగుమురవైరివైరులగురాక్షస రాజసోదరుల రాజ్యపాలనలోనాదుష్టుని నామోచ్చారణఁజేయుధీరులునుగలరా? వీరెంతనిర్భయులై ప్రవర్తిల్లుచున్నారు! వీరికెట్టివా గాడంబరమొసఁగు గల్పించిరో! మారాక్షసవంశప్రధానులగు సోమకాసురుని నాటినుండియు మాకాజన్మ

శత్రుబాట దినదినప్రవర్ధమానమగుచున్న మాక్రోధాన
లంబునకువీరి వాగాడంబరములింధనములై సతతముఁజల్లా
రని జ్వాలలై లోకంబులనెల్ల భస్మీభూతముఁజేయుచుం
డ దానినార్పువారెవ్వరు. "కల్లుత్రింగువానికి యింటి
తల్లులు లెక్కయా?" యనునట్లు హరినే లెక్కసేయని
మాకు దొంగలై సందుగొందులడాగియుండి దొంగతన
మునవచ్చి బక్కరక్కసులబాధించి రాక్షసభంగకారినని
పొంగుచున్న దొంగలరాయని యనుచరులకుజంకి సంగ
రంబున వెనుదీసి మేమునుదొంగలమైతిమనుచు భంగపా
టునొందువారమని కాబోలు; సూటిగమాయెదురనిలు
వఁబడి పోగలేక చాటుననుండి మాటిమాటికి హరిహరి
యన్నినోటికివచ్చినట్లు పాటిలేని పోటుమాటలచే మమ్ము
భయపెట్టఁజూచుచున్నారు! ఏమి వీరియోచనాశక్తి!

భళిరే! మీపొల్లుమాటలచే హిరణ్యకశ్యపుచిర
కాలజనితక్రోధానలంబు చల్లారుననుకొంటిరా?

గీ॥ కనకకశ్యపుక్రోధాగ్ని ♦ కారణమగు
హరినిదలఁచినఁగోపంబు ♦ తరుగునొక్కొ?
మండుచుండెడినిప్పులో ♦ మెండుగాను
సమిధలనుద్రోయజ్వాలలు ♦ సమయఁగలవె ॥

కావున కారులుకూయక ధీరులరైతిరేని కట్టె
దుటనిలువఁబడి కయ్యంబుసల్పి గౌరవంబు నిలుపుకొను
డు. ఏమదియొక్కఁడునురాఁడు? ఛీ! దురాత్ములారా!
దొంగలరాయని భృత్యులరగు మీకు దొంగతనంబేగా
క దొరతనంబుగల్గునా?



ఉ॥ కాయముఁగప్పిపెట్టుచుఁబగల్ ♦ బలుకార్యములన్ నిశీథినిన్
హాయిగనిద్రజెందు సమ ♦ యంబున సొమ్ములతీసిక్రూరతన్
బోయెడుచోరునట్లు సుర ♦ పుంగవులేమఱి యుండువేళలన్
మాయలుపన్నివచ్చు హరి ♦ మాటదలంపఁగ సిగ్గులేదొకో॥

"యథారాజా తథాప్రజా" యనుమాట యబద్ధ
మేలనగు? ఇంక మీతోఁ బలుమాటలేల? ఓరోరి దను
జకులవైరులారా! హరినామోచ్చారణ ప్రేరకులారా!
నాకడసారి వాక్యములాలించి ప్రాణంబులపైఁ గోరికగ
లదేని, ఈరాక్షసభూమినడుగుఁబెట్టక మీయజమానుని
బలెనెందేని యడగియుండి ప్రాణముల రక్షించుకొనుడు.
లేదేని ధైర్యముతోడనిలచి దానవనాయకునితోడఁ బో
రొనరింపుడు ఈరెండుమార్గములు గాకున్న

ఉ॥ దక్కఁగఁబోవుప్రాణములు ♦ దానవనాథు మహోగ్రహంబునన్
జిక్కినవెట్టివానికిని; ♦ జీవములందున నాశయుండినన్
గ్రక్కునజెప్పుడాహరినిఁ ♦ గన్గొనుమార్గము; దానమాకుసీ
చిక్కునుదీరుమీకును న ♦ శేషసుఖంబులుగల్గెడిన్ జుమీ ॥

చిత్రముగానున్నది. నయభయంబుల నెంతబోధిం
చిన నొక్కఁడును కంటికగుపడఁడు. రాత్రించరులే మా
యావులై యుండ "పులిమీఁదఁబుట్ర" యనునట్లు మ
మ్ము మించినవారలుండిరా? ఊఁ! ఎక్కడిమాట? వై
కుంఠేశునిపైఁ గల వైరముకొలఁది "చీమచిటుక్కుమన్న
హరియే" యని పరుగులిడుచుందుముగాన గాలికట్లు
వినియుందుము. కాకున్న నన్నుతప్పించుకొనిపోవు వాఁ
డు త్రిభువనములయందుఁ గలఁడే! తులువలాడిన వెలలేని

వెలితమాటలఁ బాటిగాఁగొని మందుడనై స్వామి
కార్యముఁద్రోసి పుచ్చుచుంటినిగానఁ దడయక మహా
రాజాజ్ఞానుబద్ధుఁడనై హరిజాడలరయనరిగెదఁగాక.

(నిష్క్రమించును)

[ఇది విష్కంభము]

హిరణ్యకశ్యపుని యాస్థానము.

[ప్రవేశము - హిరణ్యకశ్యపుఁడు - విప్రజితీ మొదలగు మంత్రులు]

హిర— విప్రజిత్త్యాది మంత్రులారా! మీరను నది, కాదనను గాని,

మ॥ అవతారంబులటంచుఁజెప్పుచును, న◆య్యా శేమదిఁ గాంచకే
యవమానంబును, మత్స్యకూర్మములటం◆చాశ్చర్యమే పారఁగా
భువిమర్త్యాళిని మోసపుచ్చి, సతతం ◆ బుఁ పూజలంగాంచునా
యవినీతుఁ హరి నెంచనేమిఫలమా ◆ నంచుఁ దలంతుఁ గదా॥

అటుగాక మనకుఁగలవైరముకొలఁది నాహరిని,

క॥ బాములకులోగిగన్గొన
నేమగుల్లాభంబుమనకు ◆ నేర్పడఁజెపుడి
చీమయొ దోమయొ నయిపో
డా! మానమునిల్పుకొనఁ ద ◆ టాలున నేలఁ ॥

మనమెన్నిసారులానికృష్టునకై పెక్కుకష్టంబుల నొంది యక్కడక్కడ వెదుక లేదు? ఎన్నిసారులామురాత్ముఁడు మనవంశకర్తల బారిఁబడి ప్రాణములఁదక్కించుకొన లేదు! వారందఱికన్న మనముతక్కువవారమా? ముఖాముఖని నిల్చిపోరఁగలఁడా? అట్లుపోరొనరించిన మనము నుకొనవలసినదేమున్నది?

మంత్రి— దానవకులకంఠీరవా! హిరణ్యకశ్యపమహారాజా! అట్లని



మనమశ్రద్ధఁ జేసియుండనగునా? ఋణశత్రుశేషములుంచజనునా?

హిర— అకుటిలాలకుని కుటిల వైదములఁదలఁచిన నవ్వువచ్చుచున్నది. వానినిఁగూర్చి మనమెందులకుఁజింతిల్లవలయు?

సీ॥ అభిమానయుతుఁడంచు ◆ నాదరించుదమన్న
నీచజన్మంబుల ◆ నెగడినాడు
సుబలాన్వితుఁడటంచు ◆ సూచింతమన్నచో
చాటుగవైరులఁ ◆ జంపినాడు
రణశూరుఁడేయంచు ◆ నణగియుండెదమన్న
దొంగయైమూలల ◆ దూరినాడు
నీతివర్తనుఁడంచు ◆ జాతుమాయన్నచోఁ
దులువచేష్టలఁజేయ ◆ దలచినాఁడు॥
సిగ్గుసెగ్గునువిడనాడి ◆ చెప్పరాని
వీరుఁడనటంచుఁదలపోయు ◆ వెఱ్ఱివానిఁ
దలఁచిభీతిల్ల నేలన ◆ ధైర్యమునను
జీమలకుజంకిమూలల ◆ జేరునట్లు ॥

నిజముగానాహరివలన మనకొక్కభీతియుఁగను పడదు. అదియట్లుండ, నొకసందేహముగూడ గలుగుచున్నది. ఏమంటివేని,

చ॥ హరియనువాఁడొకండుగలఁ ◆ డంచుఁదలంచెడిమాటకల్ల; నే
సురగరుడోరగాదులను ◆ స్రుక్కఁగఁజేయఁగ నాలమందువా
రరిగియనేకరీతులను ◆ నాపదఁబాపఁగవేడ, రాఁడొకో
సరగున భక్తసంతతికి ◆ సాయమొనర్పఁగ నుండెనేనియుఁ
భక్తవత్సలుఁడని పేరుపెట్టుకొని పరిపరివిధములఁ

బూజలంకుఁ బారుబోతు తన్నునమ్మినవారు దానవుల
చేతఁ దబ్బిబ్బులగుచుండఁ జూచియూరకుండునా?

మంత్రి— అటులయిన సోమకాసురుఁడాదిగాఁగల రాక్షసవీరులె ట్లు హతులైరనిదలచెదరు.

హిరణ్యా— పుట్టినవాఁడుగిట్టకమానునా? "విందలేక బొందిపోవదను" నార్యోక్తి మీ రెఱుంగరే. పుట్టినప్పుడే వారికట్టిగట్టిమ గణము వ్రాసియుండెఁగాబోలు.

మంత్రి— రాక్షససార్వభౌమా! ఆదిదేవుని త్రిమూర్త్యావతారముల ని బ్రహ్మ విష్ణుమహేశ్వరాదులనుచెప్పుదురు? అందుబ్ర హ్మమహేశ్వరాదులను మీరొప్పుకొనినవేగదా! మూ డవదియేమయ్యె; అది కేవలము నామమాత్రమేనా?

హిరణ్యా— నీయుక్తిసహేతుకముగా నున్నదిగాని,

క॥ దిక్కులఁ గెల్చితివీరులఁ
జిక్కులపాల్జేసినాఁడ ♦ చేవదలిర్పన్
గ్రక్కునరాఁడొకొహరియం
చొక్కఁడు భువియుండెనేని ♦ యోధుఁడుగాఁడా!

మంత్రి— అతఁడు శౌర్యసంపన్నుఁడును, భుజబలోద్దీపితుండును, అ వక్రపరాక్రమధుర్యుండునగుట వాస్తవమే. అతనిచరి త్రమే వీరుడంచుఁజాటుచుండ వేరుగఁజెప్పవలయునా?

హిరణ్యా— ఇందునమాత్రము మీతో నేనేకీభవింపను. వీఁడేయ యినదానవుల పోటుమాటలకైన మాన్పుషముకలుగదా?

మంత్రి— రాజచంద్రమా! అట్లయిననామనవియొకటియాలింపుడు

చ॥ పనివడి శత్రువర్గమునుఁ ♦ బట్టగనెంచెదువైరి యెట్టులో
ఘనభుజశక్తియుక్తులను ♦ కార్యఫలంబునుఁ గాంచనెంచదే



మనమునునట్టివారమెసు ♦. మా! పెరవారలనెన్న జెల్లునే
వినరొకొయుక్తిలేనియవి ♦ వేకునిజన్మము వ్యర్థమంచిలన్॥

కాదంటిరేని మనము శక్తిచేతను, అతఁడు యుక్తిచే తను, సమర్థించుకొనుచున్నాఁడు.

హిరణ్యా— ఛీ! అదియా పౌరుషము? యొప్పదగినమాట?

గీ॥ పౌరుషజ్ఞానకీర్తులఁ ♦ బడయునట్టి
వానిజన్మంబుఁగాల్పనే ♦ వసుధపయిని
నుదరపోషణకొఱకయి ♦ కొదువలేక
మాలకూటికిఁబొల్పడ్డ ♦ కూళలట్లు॥

మంత్రి— దేవా! బలహీనుఁడుమాత్రము యుక్తిచేతనయిన శత్రు వులసమయింపఁ బూనుకొనడా! తఱినివేచియుండి త గినసాధనము చేత కార్యముతగినట్లు సాధించుకొనుట స్వా భావికమేగదా?

హిరణ్యా— ఔనుగాని యెంతబలహీనుఁడైనను యొకప్పుడుగాకున్న నొకప్పుడైనను శక్తినిగాక యుక్తిని సాధించుకొనుచున్న ను కంటికైనఁగనుబడఁడా?

చ॥ అనవినరానిమాటలను ♦ నంటిమిమానము గల్గునన్న భా
వన, యవియెల్ల నాజడుని ♦ పట్టుననిష్ఫలమయ్యె; నాపయిన్
గనుగొనరానితావులను ♦ గాంచితిమందులగానరాని ద్రో
హినిఁబధమాధవున్ గుణవి ♦ హీనుని కట్టులగాంచనయ్యెడన్

మీరనునట్లు హరియనువాఁడొకడుండిన వానిని గాంచువఱకు నామనంబు తత్తరపాటు చెందుచుండును అందుసకు తగుప్రయత్నములనుండ నియోగించిన నా యాజ్ఞాబద్ధుండవై చాఁగలబంపియుంటివా;

మంత్రి— దనుజకులకంఠీరవా! ఆహరిపైగలవైర మత్యధికంబగుట
మాతురతఁగొలఁది మీరిట్లుతీవ్రపడుచుంటిరేగాని యేకా
ర్యమునకైన దేశకాలపాత్రములుండవలదా?

ఉ॥ కాలమువచ్చుదాక మన ♦ కార్యములెవ్వియు సాగిరావుమీ
రేలను హాశభావమును ♦ నీతిగబూనెదరయ్యా! యెరికిఁ
చాలగదైవయోగమగు ♦ సాయములేక స్వశక్తిచేత నే
లీలఫలంబునొందిన ఫ ♦ లీకృతులౌదురు దానవేశ్వరా ॥

హిరణ్య— ఛీ! దురాత్మా! చనువిచ్చి నీతో ముచ్చటించుచున్నందుల
కెట్టివిపరీతవాక్యములఁ బలుకుచుంటివి.

ఉ॥ దైవము వేఱొకండనుచు ♦ తప్పుడుమాటలు బల్కు-నట్టి నీ
కీ పరమేమనంగలను ♦ గర్వము చేతను కన్నుగానవా?
దైవమనంగ వేఱొకఁడు ♦ ధారుణినుండెనె సన్నుమించి, ఛీ
పో! వదరంగ నేలయిటు ♦ పొందికలేని విరుద్ధవాక్యముల్ ॥
దైవమనగా నాకంటె వేరు దైవముగలఁడా?

చ॥ గెలిచితి సిద్ధసాధ్యసుర ♦ కిన్నరకింపురుషాదులన్ వెసన్
గెలిచితి నష్టదిక్పతుల ♦ కీర్తివహించితి నాయనుజ్ఞలన్
దొలఁగినటింప నేరుతురె ♦ దోర్బలులెంతటివారలేనియున్
కలగని ప్రేలెదే, కనక ♦ కశ్యపు బాహుబలంబుగానవే? ॥

మంత్రి— దేవా! రక్షింపుము. మాటవరుసకట్లంటిని మిమ్ముమిం
చినవాఁడెవండు గలఁడు? అది నేనెఱుఁగనా?

హిరణ్య— ఛీ! దుర్మార్గా! నిన్నుక్షమించవలసిన దేమున్నది. నీవంటి
బేలనామంత్రియని చెప్పుకొన్నను గౌరవహీనమేనుమీ
తరతరములనుండి మీరుమంత్రిపదవి వహించుటచేయీ
పాటికూరకుండి క్షమించవలసివచ్చినది.



[ప్రవేశము సేవకుఁడు]

సేవ— దేవా! భవదీయాజ్ఞానుబద్ధుఁడనై పట్టణమనక పల్లెయన
క ఆసేతుహిమాచల పర్యంతముగల దేశమున నెల్లతా
వుల వెదకి వేసారివచ్చితిమి; ఎందునను నాహరిజాడలుగ
నంబడవయ్యె. దేవరవారికీవార్త దెలుపవచ్చితి.

హిరణ్య— ఛీ! క్రియాశూన్యా! కార్యసాధనలోనిష్ఫలుఁడవై యేమ
ని నాయెదుటకువచ్చితివి. పొమ్ము పొమ్ము నీచాతుర్య
మెల్లనగుపఱిచి యానీచహరిజాడలు తేకున్న మీమాన
ప్రాణములుదక్కఁబోవు.

సేవ— చిత్తము. (అని వెళ్ళుచున్నాఁడు)

[ప్రవేశము-వక్రదంతుఁడు]

వక్ర— దేవా! రక్షింపుము. రక్షింపుము.

హిరణ్య— ఓరీ! యెవఁడవు నీవు? నీకిప్పుడు భయకారణమేమి?

వక్ర— మహాప్రభూ! సుగుణరత్నాకరుండును, దానవకులసార్వ
భౌముండును, దితిగర్భాంభోధిరాకాసుధాకరుండును,
మీసోదరుండునునగు హిరణ్యాక్షసార్వభౌముని యనుచ
రుఁడను. నాపేరు వక్రదంతుఁడందురు.

హిరణ్య— ఓరీ! వక్రదంతా! అమితభుజబలశాలియగు నాతమ్ముని
యనుచరుఁడవైయుండియు, దిక్కులేనివానిగతి పిక్కటి
లుచు నావలనరక్షణము గోరుచున్నాఁడవేమి?

వక్ర— అయ్యా! ఇంకను మీతమ్ముఁడెక్కడ?

హిరణ్య— ఛీ! దురాత్మా ఏమట్లుప్రేలుచుంటివి.

వక్ర— దేవా! అనృతముగాదు

హిరణ్య— ఓరీ! అంతభుజబలోద్దీపితుఁడగు నాసోదరుండేమయ్యె?

వక్ర— దేవా! చెప్పుటకేమున్నది వైకుంఠుఁడు వరాహరూపం
బునవచ్చి మీసోదరునిజంపినాఁడు.

హిరణ్య—హాతమ్ముఁడా! (మంత్రితో) మంత్రులారా!

గీ॥ నాకుజూడంగ తమ్ముఁడు ♦ మీకుహితుఁడు
దేవగంధర్వయక్షుల ♦ తేజమడఁచి
దానవబలంబుఁగలిపిన ♦ ధైర్యమతిని
జంపినాఁడట హరియట ♦ సాహసమున ॥

(తమ్మునిస్మరియించి) హా! తమ్ముఁడా! అప్రతిభు
జబల పరిరక్షితదానవ కులకంఠీరవా! జగత్త్రయైకవీరా!
మదాజ్ఞానుసారీ.

గీ॥ ఆలమందలదోలెడు ♦ లీలనీవు
దోలినాఁడవు వేల్పుల ♦ దోర్బలమున
కాలవశమున నేటికిఁ ♦ గట్టుబడితొ
పాపిమృత్యువు నీపాల ♦ బడినకతన ॥

లేకున్న, పందియేడ, సురాసురగర్వనిర్బంధకుండ
వగు నినుజంపుటేడ. సోదరా! నీగుణము లెంతనివర్ణింతును

ఉ॥ మీఱియెఱుంగ వెన్నఁడును ♦ మేదినినన్నొకనాఁడు నీవుయీ
తీరునబాసిపోనగునె ♦ దీనునినన్నిట నొంటిజేసి నీ
పౌరుషమెల్లనేయడవి ♦ పాలొనరించితొ; నీకునాకయీ
తీరెఋణంబునేటికి సు ♦ ధీవర యేమనువాఁడనీగతిన్ ॥

భువనైకమల్లా! నీవులేని నాకీగతి సరోజములులేని
సరోవరముభాతి, ఱెక్కలులేనిపక్కిక్రైవడి, చంద్రుఁడులేని
నిరాత్రి రీతి, నిరర్థకములుగదా? నేనింక నెవనిభుజబలం
బునుజూచి, దలఁచి గర్వపడువాఁడను. ఆపాపిబ్రహ్మనీ



కెంతయల్పాయువొసఁగె? ఛీ! పాపీ! క్రూరా! దురాత్మా!
దానవకులభూషణుండును, శుక్రాచార్యప్రియశిష్యుండును, గ
దాయుద్ధప్రియుండునువిశేషించి నాకుతమ్ముఁడునునగు వాని
కల్పాయుష్యమొసంగి పిఱికిపందలగు దేవతాధములకుఁ బూ
ర్ణాయువొసంగెద వెంత తెలివిహీనుఁడవురా?

మ॥ అనురాగంబుననున్నతమ్మునిటుల ♦ న్యాయంబుగాఁజంపుటే
ఘనమంచుఁదలపోసినాఁడవుర ఛీ ♦ కష్టాత్మ! యేమందునీ
పనిబట్టంగఁదలంచువాఁడనిఁక నీ ♦ ప్రాణంబులెట్లుండునో
గనుమామద్భుజశక్తి నీదగినదో ♦ ర్గర్వంబుఁగ్రక్కించఁగా॥

అయ్యో! దితిసుతా! నేనెంతనాపుకొన్నను దుఃఖముపొం
గి పొంగి వచ్చుచున్నది.

సీ॥ ఎవరిపేరునువిన్న ♦ నేవేళవేల్పులు
భయకంపితాంగులై ♦ పరుగులిడుదు
రెవనినినాదంబు ♦ నించుకచెవిఁబడ్డ
బ్రహ్మాండభాండంబు ♦ బ్రద్దలగును
ఎవనిమాటఁదలంప ♦ నెదనుభీతిజనింప
రుద్రుండుసైతము ♦ నిద్రబోవ
డెవనిధాటికిజంకి ♦ యెప్పొద్దుశ్రీహరి
యడవులదిరుగాడు ♦ నండలేక ॥
అట్టిశౌర్యాధికుడవున ♦ న్నొంటిఁజేసి
పోయితివెముందు పంచత్వ ♦ మొందియకట
మాధవునిగూల్తువీవను ♦ మాటలెల్ల
స్వప్నవార్తలుగాఁజేసి ♦ శౌర్యధుర్యా! ॥

వక్ర— స్వామీ! బందుగులందఱు మృతిజెందినను దుఃఖమువ

ట్టిదో యెఱుఁగని రాతిగుండెఁగల మేమే స్వామివారిమృతి
కై వెల్లిగ దుఃఖించుచుండ నొకరినొకరు క్షణమైన నెడఁబా
యకుండి, యొకరి మేలొకరిదిగా నెంచుకొనుచున్న తమకు దుః
ఖముండుటవింతయా? అయినను, ప్రభువులగు తామే యిట్లు
శోకించిన మాబోంట్లకు ధైర్యముఁ జెప్పువా రెవ్వరు?

హిరణ్యా—వక్రదంతా!

గీ॥ బందుగులుపోవఁ బెక్కండ్రు ♦ బంధుగులను
బడయఁగావచ్చుఁ గోర్కెలు ♦ బండునటులఁ
దమ్ముఁ డేపోవ మఱియొక ♦ తమ్ముఁ డెట్లు
వచ్చునక్కట చెప్పుమా? ♦ వక్రదంత ॥

వక్ర— స్వామీ! మీరనునది వాస్తవమేగాని మది నూరట జనిం
పకఁ జేయునదేమి? గతించినదానికి వగచుట గతజలసేతుబంధ
నముగదా?

హిరణ్యా—ఓరీ!

గీ॥ తమ్ముఁ డాపోయె; ధైర్యమా ♦ తగ్గిపోయె;
దితికి శోకంబు మెండాయె; ♦ తెల్వి మాసెఁ
బోయె రాక్షసతేజంబు ♦ పూర్ణమైన
యంధకారంబు జగమెల్ల ♦ నావరించె ॥

వక్ర— కావున్న మీరు చేయనున్న కార్యమేమి! చచ్చినవారికొ
ఱకేడ్చుచు బ్రతికినవారును చావఁ జూతురా? ప్రతిక్రియఁ జే
యవలయుగాక?

హిరణ్యా—వక్రదంతా! నాకేమియుఁ దోచకున్నది కర్తవ్యమేదియో
బుద్ధిమంతుఁడవైన నీవే యోచించిచెప్పుము

వక్ర— తమ్మునకగ్నిసంస్కారక్రియలఁ గావించి వైరికిఁ బ్రతిక్రి



యసేయనూహించుటయే

హిరణ్యా—ఔరా! చక్కఁగఁ జెప్పితివి. హాతమ్ముఁడా! శౌర్యరాశీ!
నిన్నుఁ గూర్చియెట్టిదారుణవాక్యములు వినవలసివచ్చె?

(తెఱలో దితి)

హా కుమారా! రాక్షసవంశజీవనాధారా! శౌర్యరాశీ! దు
ర్మార్గుఁడైన యామాయవిష్ణువు నిన్నువరాహరూపమున నంత
మొందించెనురా! ఎదుటముఖాముఖిని పోఱొనరుపలేక యి
ప్పుడే పన్నుగడఁ బన్నెనా? అయ్యో నాకీగర్భశోకముఁ దీర్చు
వారెవ్వరు. అక్కటా, నీవు జేసినతపములు నీవుబడసినవరము
లు చివరికీపాడుపందిచెంత నిష్ఫలములయ్యెనా? అబ్బా! వే
యి జన్మములెత్తినను నావంటినిర్భాగ్యురాలికి నీవంటియు
త్తమగుణుండు దక్కునా? చెడుకాలము దాపించువఱకు
చేయునదేమి. ఆపాడుహరిని సంహరించువఱకు నాకీగర్భ
శోకముచల్లారునా? హా! కుమారా! కనకకశ్యపరాజా! ఎం
దున్నావు. నాయనా! నీతముఁడెక్కడనున్నాఁడు? ఎదీ నా
వైపుఁ జూడవేమి? నీవెక్కడనున్నావు.

హిరణ్యా—తల్లీ!

ఉ॥ తమ్ముఁడు కూలినాడ నెడి ♦ దారుణవార్త నెఱింగి కూడ జీ
వమ్ములతోడ నుంటినిట ♦ వైరికిఁ దత్ప్రతికారమేమియుఁ
సమ్మతిగానుజేయఁగల ♦ శక్తినిఁ గాంచక మొండినోచు స్వ
చ్ఛమగునట్టి యీదనుజ ♦ సంతతిలో దలవంపులౌనటుల్ ॥

ఇట్టియపాత్రపుత్రునిఁ గని నీవుగూడ నిందార్హురాలవై
తివిగదమ్మా.

వక్ర— రాజా! నీవేయిట్లుమిక్కుటముగ దుఃఖించుచుండిన ది
క్కులేక నొక్కకరణికంటికేక ధారగావిలపించు నబలలనూ

రడించువారలెవ్వరు.

హిర—ఎవరినివారే నూరడించుకొనవలయుఁగాని పరులచేత నేమగును? అయినను తల్లీ! నీపుత్రుండు శూరులందఱుఁ బోయెడు మార్గమునే యవలంభించి జగత్ప్రఖ్యాతమగు మరణము నొందెను. దానికై యింతవగవనేల. అదియట్లుండ తల్లీ! ఎక్కడిపుత్రులు? ఎక్కడిబంధుగులు? ఒక్కరితో నొక్కరికేమి సంబంధము?

క॥ నట్టేటనుఁబడివచ్చెడి
కట్టెలెయొకచోటఁజేరి ♦ కదలక నొకచో
కట్టగఁగూడియు నావల
నట్టిట్టై పోవుచుండుఁ ♦ టవనిన్ గనమే ॥

ఆకట్టెలుకట్టగానుండినట్లే దేహమున్నంతవఱకు సతీపతులనియుఁ దల్లిదండ్రులనియు, నన్నదమ్ములనియు, మొదలుగాగల సంబంధబాంధవ్యములతోఁ గొట్టుకొనుచుందురు గాని తుదకు కట్టవిడిపోయి వేఱు వేఱుగ దేనికదేపోవు కరణిపోవుదురు. ఈశ్వరుండు కర్మసంసరణంబున యోగవియోగంబులగల్పించు. కావున,

ఉ॥ తల్లియుఁదండ్రియున్ సుతులుఁదమ్ములుచుట్టములంచు నెంచుచున్
యుల్లమునందు నెక్కుడగు ♦ నూహలఁజిక్కుదురంతెగాని యో
తల్లిరో! సర్వమున్ జగతి ♦ తథ్యములే! మఱికల్లగావ్రికో
తొల్లిఁటిఁగర్మయోగమునఁ ♦ దోచును యోగవియోగముల్ సదా

ఇట్టిమాయామయప్రపంచము నెఱింగెడితత్వజ్ఞులు నిత్యానిత్యంబులఁ గూర్చిసుఖదుఃఖంబులనొందరు. అజ్ఞానులుయోగవియోగంబులకు సుఖదుఃఖంబుల వరుసగా నొం



దుదురు. అంతియగాని.

కం॥ పరులెవ్వరో తామెవ్వరో
యెఱుఁగరు మూఢత్వమున నె ♦ కించుక యేనిన్
బరమజ్ఞానము లేమిని;
తరుణిరో! చింతింపఁదగునె ♦ తనయునిమృతికై ॥

కావునఁ చింతవిడచి భర్తృవియోగశోకాకులిత స్వాంతయగు నీకోడలి నూఱడింపుము. నేనుసుఁదమ్ముని కగ్నిసంస్కారంబులం గావించి వైరినాశనముకై వలయు ప్రతిక్రియ సేయ నూహించెదను.

దితి— నాయనా. అట్లనేపోయెదఁగాని (చెవులోనేమోచెప్పి) యీ మాటమాత్రము మఱువకుము. (నిష్క్రమించును.)

హిర—(వైరినినుద్దేశించి)ఛీ. దుష్కర్మా! రణరంగంబున నిల్చిపోరలేక యంగనలతోఁగ్రీడలఁదేలు నాయనుంగు సోదరునిఁజంపితినని విఱ్ఱవీగుచుంటివేమో! నీకదిపౌరుషమేగా!

ఉ॥. పోటతనంబునన్ దనుజ ♦ పుంగవులన్ గెలువంగలేక యే
చాటునడాగి నాయనుజుఁ ♦ జంపితివా? పురుషాధమా! నినున్
గాటికిఁబంప కేవిడువఁ ♦ గాచుకొనంగమకింపు ప్రాణముల్
మాటలవాఁడగానిఁకణు ♦ మాత్రముసందియమందఁబోకుమా

ఛీ. నీచా! నీపౌరుషమునకును నీగుణంబులకును నీవెత్తుజన్మములు సరిపోయినవి.

ఉ॥ కూర్మిమొపంది యోయగుచుఁ ♦ గూల్చుటెగా నిరణప్రతాపులన్
నిర్మలబుద్ధితోడ సుమ ♦ నీషులనెవ్వరిఁ గూల్చినాఁడవో
దుర్మతి! చెప్పుమా! మదికిఁ ♦ దోచదొకో యవమానమంచు ఛీ
మర్మముగాదు నానుడువు ♦ మాటల నిక్కముజూతువిప్పుడే

వక్ర — దేవా! శోకాకలిత స్వాంతుండవై క్రోధాతిరేకంబున మీఱి ట్లుపల్కుచుంటిరే గాని యిందెవరున్నారు. తనపనిఁ గావించుకొని వైరి మీకుఁ జంకుచు నెందో డాఁగియున్నాఁడు. గాని మీరనినట్లు మీయెదురఁ నిలిచిపోరఁగల సామర్థ్యమే యున్నచో నీచ జన్మము లేల నెత్తును? సోదరునకపర క్రియలఁ గావించిన పిదప నాతనివధకై తగు ప్రయత్నమునకుఁ గడంగుదము.

హిర — వక్రదంతా! వాస్తవమే. పాఱుబోతు గాకున్నఁ బందియేలనగును. హా తమ్ముఁడా! నీకిప్పుడే కరణి నపరక్రియలఁ గావింతును. వక్రదంతా! సంస్కారక్రియలకుఁ దగిన సామగ్రిసిద్ధపఱచి యిందుఁ దెమ్ము. (ఉదకంబు చేతఁ బూని)

హా తమ్ముఁడా! శౌర్యరాశీ!

ఉ॥ "ధీరత పీడిన న్నటువ ♦ ధింపఁగ వచ్చిన నీచు రక్తమున్
జేరిచి తర్పణంబు వడిఁ ♦ జేయుదు నాయనుజుండటంచు నా
నేరము లెంచఁ బోకుమి వి ♦ నీతిచరిత్రుఁడ! దానఁ గూడ నీ
కోరికఁ దీర్పవాఁడ నివి ♦ గ్రోలుము ముందుగఁ గోపగించకన్
(నీరు వదలి) హా. నీచచోరా! పాపి కేశవా!

ఉ॥ క్రూరపు బుద్ధి నాయనుజుఁ ♦ గూలిచి నీచపుఁ బందిరూపమై
పౌరుషశాలి నంచు వడిఁ ♦ బల్కఁగ నీకెటు సిగ్గు లేదురా
పాఱుఁడ! యెందు బోయినను ♦ బట్టి వధింపక మాననింక ఛీ
రార మదీయ సోదరుని ♦ ప్రాపునఁ జేర్చెద డాగనేమగున్
వంటయింటి కుందేలవైతివి. ఇంకెందు బోఁగలవు. చీమయై దోమయో యై తప్పించుకొందునను ధైర్యమున్న దేమో

క॥ ఏ యవతార మయినఁ బో
నీయను నిస్నేమనంగ ♦ నీయను విసరా



నీయవసానము వచ్చెను
కాయమునందాస వదలి ♦ కాచుకొనఁదగున్

ఓరోరి. మంత్రులారా! మదీయసోదరనాశనకరుండగు నాహరినిఁ బట్టి వధించుటకై కనకగర్భునిఁ గూర్చి తపం బాచరించి సాటిలేని మేటివరంబులంది వచ్చునందాక మీరీ రాక్షసరాజ్యమును కడు జాగరూకతతోఁ బాలించుచుండుఁడు. ఎచ్చటనైన నా హరిజాడలగుపడిన నా యాజ్ఞావసరము లేకయే బట్టి వధించుఁడు. ఇంకను

చ॥ మునుల నిజాలి నెందకను ♦ మూఢులటంచుఁ దలంచకుండగన్
వనములఁ బాడుఁ జేయుచును ♦ వచ్చెడి పోయెడి వారిఁ జంపుచున్
అనయము నెల్ల తావులను ♦ నారయుచున్ మఱి కుక్కనక్కలం
చసిదలపోయ కుండమన ♦ మందున ప్రేమఁ వలంపకుండగన్
పనిబడి యెల్లజీవముల ♦ బట్టివధింపుచునుండుఁ డెల్లరున్

మీకెల్లరకు యిదియే నాకడసారి యానతి. ఇంతియగాక

క॥ హరియను రెండక్కరములు
వరవడికైనను లిఖించు ♦ వానినిగూడన్
సరగునఁ బట్టి వధించుఁడి
యరమర లేకుండ మీర ♦ లతిభీకరులై

మఱియు

సీ॥ పూలతోటలటంచుఁ ♦ బొనలడొంకలటంచుఁ
దలచక ప్రతిచోటఁ ♦ దాకవలయుఁ
బుణ్యభూములటంచుఁ ♦ బోవుదారులటంచు
నెంచక ప్రతిచోటఁ ♦ గాంచవలయు
నీళ్ళ జాడలఁ గాంచు ♦ నేర్పు జాలరులచే

నీటియందునఁగూడ ♦ నెమకవలయు
నీచజీవములంచు ♦ నెంచక ప్రతిజీవ
సమితిని విడువకఁ ♦ జంపవలయు
నివ్వియేగాక మార్గము ♦ లెన్నియున్న
నన్నివిధముల హరిజాడ ♦ లరసిజగతి
పాపి కేశవుఁ బరిమార్చు ♦ పట్టుదలను
నుండఁగావలె మీరలు ♦ ద్దండలీల
నెల్లభారంబు మీయది యేసుమా! జాగ్రత్త

మంత్రి—చిత్తము. (నిష్క్రమించుచునారు.)



## ద్వితీయరంగము.

(అంతఃపురము——ప్రవేశము—లీలావతి.)

లీలా—(తనలో) (2. అనుబంధము.)

అకటా నావిభుఁడు నన్నెంత మోసపుచ్చె.

గీ॥ "వనిత నేనేగి వనమున ♦ వనజభవునిఁ
గూర్చితప మొనరించినా ♦ కోర్కెలెల్లఁ
బడసి వచ్చెదనందాక ♦ పడతిమిన్న
"డెందమున గుంచబోకుమి ♦ సంతసమున

అనుచు నాకెన్నియో నమ్మకములఁ జెప్పిపోయె. మాసములు గడువఁజొచ్చినను నాపడు రాఁడయ్యెను. (కుడికన్ను దురుటఁజూచి) హా నాదక్షిణనేత్ర మేటికిట్లదరఁజొచ్చెను. ఉదయమునుండియు నాహృదయంబున బెదరు పదరుచుండెను. అవశకునము



లెన్నియో గనఁబడుచున్నవి. తపస్సునకేగిన దానవనాయకున కేదైన విపత్తు సంభవించి యుండునా? అయ్యో వేఱుకష్టమే మిగులఁగలదు? కేశవునితోడి వైరమొకటి యుండెఁగదా? "హరితోడి వైరము వలవని నేనెన్నిసారులు" బ్రతిమాలినను నామాట చెవినిఁబెట్టక "దానుబట్టిన కుందేటికి మూఁడే కాళ్లనునట్లు పట్టుపట్టి యాతని మట్టుబెట్టెద"నని కంకణముఁ గట్టుకొని యున్నాఁడుగాని వానిమాయ చెయ్దములఁదలంచిన భయమగుచున్నది. ఆహరిని సాధించుటకీ మహారాజునకు మాత్రము తరమగునా? ఎందఱెందరు యోధానయోధులాహరిచేత నంతమొందలేదు?

ఉ॥ కూల్చెనుగాదె సోమకునిఁ ♦ గుంభిని మాయగ మత్స్యరూపమై
తాల్చెనుగాదె మంధరఁబ ♦ దంపడి వీపునఁ గూర్మరూపమై
గూల్చెనుగా వరాహమయి ♦ కొంకక జంకక నామఱందినిన్
గూల్చెఁడె తక్కువారలనుఁ ♦ గూడ నిరంకుశవృత్తితోఁ వఁగన్॥

దానవుల పాలిటి మారియై జన్మించిన వానితోడి వైరమేలనో గదా! దానవులే మాయావులన్న దానవుల పాలిటి దానవుండై బాధించుచున్నాఁడు. అయ్యో! నాకేమి చేయుటకుఁదోచకున్నది.

ఉ॥ దానవ సత్కులంబికను ♦ దాపుణిసుండెడి మాటనిక్కమే?
కానరు విష్ణుమర్మములు ♦ గర్వితచిత్తుల రాచురక్కసుల్
మానరు వైరబుద్ధిఁదము ♦ మంకుతనంబున నేమనందునా
కానలకేగినట్టి ప్రియ ♦ కాంతుని జీవితశంక గల్గెడిన్॥

నాథుండును యుక్తాయుక్త విచారణమానియున్నాఁడు అయ్యో! ఎట్టికార్యమునకైన దేశకాలపాత్రంబు లెంచవలదా?

పరశక్తియుక్తులు పరికించి తనశక్తియుక్తులఁగని ప్రవర్తించ వలదా? ఆడుదానకున్నంత యోచనయైన నుండవలదా?

సీ॥ అనుజుండు చావనా ♦ కండఁబోయెనటంచు
దానవవీరుండు ♦ దలఁపవలదె?
తనకన్న బలవశ ♦ తనుజెలంగి యడంగి
నట్టివారలపాటు ♦ లరయవలదె
"పతిదైవము"నిసదా ♦ హితము నేకోరెడు
కులకాంతమాటలో ♦ నిలువవలదె?
బలమున్న నేమాయె ♦ పగతురతోఁ బోర
దేశకాలములను ♦ దెలియవలదె?
దేనిఁగాంచక త్రుంగకిట్లు ♦ పూనిశౌరి
తోడఁబోరుటతగదంచుఁ ♦ దోచవలదె?
సర్వమెఱిఁగినదానొక ♦ జడునిమాడ్కి
వెడలఁదలపెట్టఁదగదన్న ♦ వినఁగవలదె?

నా దక్షిణ నేత్రమేటికో మఱిమఱియదరఁజొచ్చెను. వనితలకు దక్షిణ నేత్రమదరిన వనటగలుగునని పెద్దలు చెప్పుదురు. ఏమికీడు రానున్నదోగదా? దైవమా! ఈపాపపుచెవులీనాఁడెట్టి దారుణవార్త విననున్నవోగదా? హా దేవదేవా! సర్వేశ్వరా! నీవేదిక్కు.

తురంగవృత్తము

కరుణవదలక వనిత మొరవిని ♦ కావుమోజగదీశ్వరా
చరిత మెఱుఁగను క్షితిని గలుగదు ♦ తోడు నీడమహేశ్వరా
శరణు శరణని మఱిమఱిమనిని ♦ సంస్తుతించెద శంకరా
గరళము గళమున నిడితివిధరఁ ♦ గావవే పరమేశ్వరా॥



నీకంటె చుట్టములును మిత్రులును, మఱిదైవమును లేఁడని నమ్మితిగదా మాపారందఱు హరితోఁబగఁగొని నిన్నారాధించుటగాన, నీభక్తునియందు దయఁజూపియతనికేయిక్కట్టును రాకుండఁ గాపాడుము.

సీ॥ కరుణించి బ్రోవవే ♦ కామసంహారకా!
ప్రాణనాథునికెట్టి ♦ భయములేక
వరము లొసంగవే ♦ వ్యాఘ్రచర్మాంబరా!
ప్రాణనాథునకెట్టి ♦ భయములేక
కాచిరక్షింపవే ♦ గరళకంఠేశ్వరా!
ప్రాణనాథునికెట్టి ♦ భయములేక
ననుదయనేలవే ♦ నందివాహన! దేవ!
ప్రాణనాథునకెట్టి ♦ భయములేక
అన్నిటికి నీవెయంచు నే ♦ నహరహంబుఁ
దలఁచి వేడుచునుంటిఁగా ♦ దయనుఁగాంచి
ప్రాణనాథునికేమిట ♦ భయములేక
మాచి మన్నింపవే నన్ను ♦ శూలధారీ!

(తెఱలో)

ఓరోరి పిశితాశనులారా! భుజబలయశోవిలాస గర్వాంధులారా! ఇంకెందుఁబోయెదరు! నిలునిలుండు

లీలా — పిడుగుఁబోలిన యీయార్తరవమెచ్చటిదైయుండును. మహారాజుపైగలకోపకారణంబునయూరలేఁడని యెఱింగి యెవరెట్టి ద్రోహమునకుఁదలపడిరో? ఎట్లుతప్పించుకొందును. ఇంకేది శరణ్యము. మరల నేదియో వినఁబడుచున్నది.

(తెఱలో)

ఏమనుచుంటిరి? నేనెవఁడననియా? నేనెవఁడనో దెల్పెద నా
లింపుఁడు.

ఉ॥ కొండలతెక్కలన్ విఱుగఁ • గొట్టినధీరుఁడ రాక్షసాళికిన్
గుండెలలోని గాలమును; • గూర్చుసఖుండను దానవారికిన్
భండనభూమి శాత్రవుల • పాలిఁటికాలుఁడ వచ్చియుంటిమీ
దండితనంబుఁగ న్గానఁగ • దానవులార! కుహేంద్రనాముఁడన్

లీలా—ఔరా! అనుకొన్నట్లేయయినది; ఈదేవతు లెంత విపరీతముఁదలపెట్టిరి. దానవనాయకుఁడింట లేని తఱినిఁగని సమయంబని యూహించిరిగాఁబోలు! నా ప్రాణనాథుని పేరువిన్న భీతిచేమానప్రాణముల నరచేతిలోనుంచుకొని మూలమూలడాగు దేవతుల కిట్టిధైర్యమేలఁ గలిగెనో చెప్పుమా? యూహించఁదపమునకేగిన ప్రాణనాథుని నామాయహరియేమో మాయఁజేసియుండనోపు. హా! ప్రాణనాథా! నన్నిట్లనవమఁ జేసిపోవన్యాయమా? మధుసూదనుని మట్టుఁబెట్టెదనన్న మాటలన్నియు నీళ్లమూటలై తుదకువానిచేతనే పరాభవింపఁబడినన్ను నిర్భాగ్యురాలినిఁగా నొనరించితివా! అఖండభుజబలసమన్వితమైన నీకిట్టియకారణ కష్టములుఁ గలిగెనన్న నెట్లునమ్మనగు? అయ్యో! మరలనేమియో వినవచ్చుచున్నది

(తెఱలో)

ఉ॥ సైనికులార! ముందుగని • శాచరవీరులఁబట్టికొట్టి మీ
మానసమందుఁజాలినను • మాత్రముఁ జూడకఁ గోపసంగతిన్
బూనితదంగనామణుల • పొట్టలుచీల్చుఁడి; జాలమేల నీ
దానవదుష్టులంబికను • ధారుణిఁగన్పడకుండఁజేయుఁడీ ॥

లీలా—అయ్యయ్యో! దేవతులింత ద్రోహమునకుఁ దలపెట్టుదురని



లనై నాఁదలంపనైతిమే; నాకింకేదిదిక్కు? సకలమండలాధినాథకిరీట రత్నాలంకృతపాదుఁడగు కనకకశ్యపుని కర్ధాంగినై సురగరుడోరగాది మహామహులకాంతలఁ బట్టితెచ్చి చెఱఁబెట్టినప్పుడు జాలిజెంది వారికిట్టిబన్నములురాకుండ నాథునిబ్రతిమాలుచుండునా కిట్టిసంకటములు రాతగినవియా? ఆపుణ్యమైననాకక్కఱకురాకపోయెనుగా, మరలనేమో వినఁబడుచున్నది.

(తెఱలో)

చ॥ తడయఁగరాదు గన్గొనుఁడు • దానవవీరులు ఖడ్గపాణులై
వడివడిఁదాకఁ గానిటుల • వచ్చుచునుండిరి భీతిజెందకా
గడుపరి రాక్షసాధములఁ • గట్టుడిఁ గొట్టుడి బిట్టదల్చుడీ
పొడిపొడిఁజేయ వేగముగఁ • బొందుఁడు యవక్రపరాక్రమమ్మునన్

లీలా—భళే! రాక్షసులారా! మీస్వామిభక్తియెంతయు శ్లాఘాపాత్రమేసుమీ! రాజూరలేఁడన్న లోపముఁగనుఁబడనీయక వెనుదీయక మీశక్తికొలది శాత్రవుల నెదుర్కొనుచుంటిరి. (చూచి) అక్కటా? మాబలములకిట్టి సంక్షోభము గలిగె?

గీ॥ వ్యాఘ్రములఁగాంచి భీతిచేఁ • బరుగులిడెడు
నాలమందల రీతిగ • నసురసేన
పరుగులిడుచుండె నక్కటా • భయముదోప
సురలనెదిరింపఁజాలక • దురమునందు ॥

అయ్యయ్యో! కనులబడినరాక్షసాంగనల నెల్ల బలిమిఁబట్టి కరుణాహీనులై గర్భచ్ఛేదమొనరింపుచుండిరి. దేవతులుదయావంతులండ్రురే? ఇదియేగాఁబోలు వారల దయాహృదయము? నారినన్న పనియేమున్నది.

గీ॥ చీకటులు బోయి వెన్నెలల్ • చేరునట్లు
దనుజసంతతిశౌర్యంబు • తగ్గిపోయి
సురలుచలరేగినేటికి • శుంఠపనులఁ
జేయ మొదలిడినారెట్టి • చిత్రమహహ ॥

(మరల తెఱలో)

గీ॥ రండురండిక యాంతివు • రంభునకును
జొచ్చుమార్గంబుఁజూపుడు; • జూపకున్న
యజ్ఞపశువులకై నడి • హతము జేతు
మిమ్ము నందఱనిప్పుడే • నమ్ముడింక ॥

లీలా—అక్కటా! కావలసినపనినంతయు దీర్చుకొని దేవేంద్రుఁడంతిపురంబునకుఁ గూడవచ్చుచున్నాఁడు. దిక్కుగలిగియు దిక్కులేనిదాననైతినే. కానున్నది కాకమానదు. అన్నిటికా పరమేశ్వరుఁడే గలఁడు.

ఉ॥ శంకర! భక్తవత్సలవ • శంకర! శత్రు భయంకరా! హరా
సంకట నాశనా! దనుజ • సంస్తుత పాదభుజంగభూషణా!
జంకక నీశచీధవుఁడు • సాహస వృత్తిని నన్నుఁ బట్టిదా
వంకర కార్యముల్ సలుప • వచ్చెను బ్రోవరె చింతదీర్పరె

(3. అనుబంధము)

(ప్రవేశము—ఇంద్రుఁడు)

ఇంద్రు—దానవసార్వభౌమపట్టమహిషీ! ఎందుఁబోయెదవు

ఉ॥ చిక్కితివిందు పంటయులుఁ • జేరిన కుందెలురీతినీకిఁక
దిక్కెవరుండినారు మది • దీనతనొందఁగ వేళగాదునా
చక్కికిరాకఁ దప్పదు ని • శాచరులందఱు గూలినారలిం
కెక్కడికేవు పోఁగలవిఁ • కేల వృథాపరిభాషలక్కటా ॥



లీలా—అయ్యా! ఇదేటి యాగడము? ఎన్నఁడు నిట్టిక్రూరకార్యములకు సాహసించిన వారుగారే? నేఁడేలఁగల్గె? నా పురాకృతదుష్కృతము నన్ను బాధింప మీకీబుద్ధిపుట్టించెనా?

(4 అనుబంధము)

ఇంద్రు—న్యాయమో? అన్యాయమో? నీమగండేమిన్యాయమనియెంచి యిట్టి కార్యములఁ జెక్కులఁ జేసె. ఎప్పుడునంధకారమయమగు రాత్రియే యుండునా?

ఉ॥ చెప్పఁగరాని కార్యములఁ • జేయఁడె నీమగఁడెన్ని సారులో
యప్పుడు "తుచ్ఛకార్యముల • నక్కట జేయకుమంచు" నాథులోఁ
జెప్పఁగలేక పోతివయి • నీ! యిపుడిట్టులు గాదె భామినీ!
తప్పునె పుణ్యపాపఫలి • తంబును బొందక నూరకుండుటల్

లీలా—అన్నా! నాయెడనీకీ యాగ్రహబుద్ధిజెల్లునా? నన్ను వేఱుగఁ జూచుట న్యాయమా? మగవారలు మగంటిమిఁ జూపఁ జేయు కార్యములకుఁ గినిసి వారలింట లేనితఱి నబలలను బల్మినిఁ బట్టనూహించుట ధర్మమా; పౌరుషమా? అంతియగాక నాప్రాణనాథుండును నీవును దితిసంతతి వారలగుటచే

ఉ॥ అన్నగదయ్య నీవు; తగు • నయ్య గుణాధిప! యన్నభార్య నీ
తెన్నునఁజన్న బుచ్చుటలు • తేజమటయ్య దలంపుమయ్య నీ
వెన్నఁడుఁ జేయనట్టిపను • లేటికిఁ జేయఁదలంచితయ్యయో
తిన్నగ నేఁడుమా మదిని • దీర్ఘపుకోపము నుంచఁ బోకుమా

ఇంద్రు—ఔను వాస్తవమే! నీమగఁడు మాత్రము యిట్టిబాంధవ్యమును విచారించెనా?

లీలా—విచారింపలేదు; దాసికినాఁడు దానవన్నేమి చేయమందురు? అవులావులు పోరాడి లేగలకాళ్ళు త్రొక్కిన చందముగ జేయ

నీతియా? ఖ్యాతియా! అంటున నేను పరకాంతను. పరకాంత యెడల మీకీభేదబుద్ధి గలుగుట ఘోరకలుషము గాదె.

ఇంద్రు—తరుణీ! నీయెడఁబరాభిలాషినై వచ్చితినని దలంపకుము.

లీలా—మఱినీరాకకు కారణమేమి?

ఇంద్రు—“గర్భవతియగు నీకర్భకుఁడే పుట్టిన నిర్భయంబునఁదండ్రివలెను మ్మెట్టి దుర్భర శ్రమలపాలొనరించునో” యను భయంబున గర్భస్రావ మొనరించుటకు లేక ప్రసవమగువఱకుఁజెఱసాలనుంచి యర్భకుఁడే గలిగిన హాత మొనరించుటకు.

లీలా—హా! శివశివా! పరమేశ్వరా!

శా॥ రారే సత్కృప జూడరే! తలఁపరే ♦ రక్షింపరే! గావరే!
క్రూరాత్ముండు శచీధవుండిటులనన్ ♦ గొంపోవఁగావచ్చెఁగా
కారే యార్తుల బ్రోచువారలకటా ♦ కష్టంబులన్ బాపరే
మీరేదిక్కట వేఱు లేరుగదనా ♦ మేలెంచుడీశంకరా॥

ఇంద్రు—తరుణీ! ఎట్టులను నీకీమువ్వతప్పదు

గీ॥ ఆలసించిన నేసైపఁ ♦ జాలనమ్మి
మంచిమాటలరమ్మి ♦ నీవంచితముగఁ
దడవు చేసినబంధించి ♦ తప్పకుండఁ
జెఱకుగొనిపోదు భామినీ ♦ శీఘ్రగతిని ॥

లీలా—అయ్యా! నాపైజాలి గలుగదుగా? నానాథుండు గతించినాడని దలంచుచుంటివేమో? తపమునకేగియున్నాడు. మరలిరాఁగలడు. ముందు వెనుకలాలోచించుకొనుము.

ఇంద్రు—తరుణీ! నన్ను భయపెట్టుచుంటివా? తపమునకేగిన నీమగఁడు మఱలివచ్చునో లేక నక్కడే హరిచేతఁజచ్చునో యెవ్వఁడెఱుఁగు. ముందు జరుగు సంగతిఁగనుఁగొన నేర్తుమా? వచ్చినప్పుడు



చూచుకొనవచ్చును లే? ఇప్పుడు మాత్రము నీవు రాకఁదప్పదు. వచ్చెదవా? లేదా? (అని కొప్పుఁబట్టుకొని యీడ్చుచుండును)

లీలా—హా దీనబంధో! ఆర్తజనరక్షకా! గౌరీమనోహరా!

(5. అనుబంధము.)

[నారదుఁడు ప్రవేశము.]

నార—మహేంద్రా! చాలు చాలు నీసాహసము. అల్పులమాడ్కి నీకీయాగడబుద్ధితగునా? తోడివారువిన్న నగిపోరా?

ఇంద్రు—(లీలావతి నివదలి) మహాత్మా! మీరిందేల వచ్చితిరి?

నార—నీసాహసకార్యమునుఁగని నిన్ను వారింపవచ్చితి. నీవెంచినట్లు యీయమగర్భమునఁ కుటిలచిత్తుఁడైన దానవుఁడుగాక పరమభాగవతోత్తముఁడైన హరిభక్తుఁడు జనింపఁగలఁడు. వానివలన మనకనేకశుభములు గలుగఁగలవు లెమ్ము. నామాటలు నమ్మి నీపురమునకుఁబొమ్ము.

ఇంద్రు—మహాత్మా! సత్యమేనా?

నార—నేఁజెప్పవలయునా?

ఇంద్రు—ఆజ్ఞాపైనసరే.

(నిష్క్రమించుచున్నాఁడు)

నార—అమ్మా! ఇప్పటికే చాలశ్రమలఁబడితివి. నీభర్తవచ్చువఱకు నాయాశ్రమమునందుండువుగాని రమ్ము పోదము.

[అందఱు నిష్క్రమించుచున్నారు]



# భక్తవిజయము



## ద్వితీయాంకము.

(ప్రవేశము అలంబసుఁడు)

అలం—నేఁడు ప్రాతఃకాలమున విప్రచిత్త్యాదిమంత్రులు నన్నుం బిలిచి "ఓసీ! అలంబసా! హిరణ్యకశ్యపమహారాజుగారు తపస్సువదలి వచ్చుచున్నారని యిప్పుడే చారులవలన వింటిమి. మేము వారి నెదుర్కొనఁబోయెదము. మేము వచ్చులోపల నీవు సభామంటపమలంకరించుటయే గాక రాజుగారి యాగమనంబునకై ప్రతియింట నుత్సవంబులఁ గావింపవలయునని పురమంతయు జాటంబను" నా కాజ్ఞ నొసంగిరి. సరే. ఇప్పటికి నా పని ముగించుకొంటిని. అదిగో! వాద్యముల మ్రోత వినవచ్చుచున్నది. రాజుగారును పురముఁ బ్రవేశించియుందురు. నేనిచటనే యుండి వారే యేవరములఁ బడసిరో కనుఁగొని దేవేంద్రుఁడు దేవిగారిని చెఱఁగొనిపోఁదలచిన సంగతి రాజుగారికిఁ దెల్పి, యెట్లు తప్పించుకొందురో వినుచుండెద.

(ఇది విష్కంభము)

—(0)—

ప్రథమరంగము.

ప్రవేశము హిరణ్యకశ్యపుఁడు, మంత్రులు.

విప్ర—మహాత్మా! తమ తపోవృత్తాంతము వినని దాసుఁడు కుతూ



హలపడుచున్నాఁడు.

హిర—అవును. మా తపోవృత్తాంతముఁ ద్రోవలో నారంభించియుఁ బ్రసంగాంతరమునఁ జెప్పమఱచితిని. వినుమట్లు నేను మంధరపర్వతాగ్రమునఁ జేరి యొంటికాలి బొటనవ్రేలిమీఁద నిలువఁబడి యూర్ధ్వబాహుఁడనయి.

ఉ॥ ఘోరతపో మహాత్యమునఁ ♦ గుంభిని తల్లడమందఁగా జలా
హారుఁడనౌచుఁ గొంతపడి ♦ నాపయి వాయుభుక్తిగా గ నే
దారుణమైననిష్ఠను వ్ర ♦ తంబును సల్పుచు నాపయిన్ నిరా
హారుడఁ గూడనైతి ముద ♦ మందగ ధాతమదీయ భక్తికిన్॥

ఇట్టి యుగ్రతపమే జగంబున నే యుగంబున నెవ్వరును జేసియుండ లేదని యే నా యభిప్రాయము. అట్టి నిశ్చలతపస్సమాధి నుండఁగా.

ఉ। పుట్టలు పెట్టి దేహమునఁ ♦ బాయెను రక్తము దేహమంతయున్
బిట్టలు గూళ్ళఁ గట్టుకొని ♦ పిల్లలతో వసియింపఁ జొచ్చె నా
జుట్టున; కర్ణరంధ్రముల ♦ చోద్యముగా నల భృంగవర్గముల్
కట్టలుగా వసించె పల ♦ లంబును జీర్ణమునయ్యె మిత్రమా॥

అట్టి నా ఘోరతపోజ్వాలలు ముల్లోకముల మించి భస్మీభూతముఁ జేయఁదొడఁగిన మునులు, దేవతలు, భయపడి బ్రహ్మయొద్దకుఁ బోయి మొఱలిడిరఁట.

మంత్రి—అవును దేవతలెప్పుడును బరులతపస్సును భంగముఁ జేయఁ జూచుచుందురు. తమదాడికి జడిసి గాఁబోలు తామాపనిని స్వయముగాఁ బూనక బ్రహ్మవద్దకరిగి మొఱలిడినారు. దానికిఁ గమలసంభవుఁడేమి ప్రత్యుత్తరమిచ్చెనో?

హిర—ఆమహాత్ముఁడేమి చెప్పెనోగాని వారిమాత్రము తమ కార్య

మును పూనక నొకయచ్చరను శృంగారించినాకడకనంపిరట యీవృత్తాంతము వరములిచ్చినప్పుడు పితామహుఁడే నాకెఱింగించె. కానిమ్ము. నన్నట్టులభంగపఱుపఁజూచిన నా దేవతలపనియు వారియాజ్ఞమెయి ప్రవర్తించిన నాయచ్చరలపనియు నింకఁజూచెద. వారెన్ని ప్రయత్నములొనరించినను నాయెడఁ బనికిరావయ్యె.

విప్ర— దేవరవా రేవరములందివచ్చితిరో వినఁగుతూహలమగుచున్నది. నన్ననుగ్రహింపవేఁడుచున్నాను.

హిర— నాపైగరుణించి యాదేవతలమొఱనాలించి పితామహుఁడు నాదరికరుదెంచి, మంత్రోదకము నాపైఁజల్లి నన్ను వజ్రదేహునిఁజేసి యిట్లనియె.

ఉ॥ "ఓ సురవైరిముఖ్య! యిటు ♦ లుగ్రతపంబును ముందు నెప్పుడుం
జేసినవారులేరు; మఱి ♦ జేయఁగఁబోయెడివారులేరు; నా
యాసముఁజెందఁబోకుము మ ♦ హాత్ముఁడవౌదువు నిశ్చయంబుగా
నీసరి రాఁడెవండుయజ ♦ నీచర! దెల్పుము నీదుకోరికల్" ॥ అని

మంత్రి— పితామహుఁడు భక్తవత్సలుఁడుగదా? తరువాత.!

హిర— తరువాత నేను భక్తిపూర్వకముగఁ బ్రణామములాచరించి ముకుళితకరకమలుండనై, యనేకరీతుల సంస్తుతించి, ప్రసన్నుఁడైన నాహిరణ్యగర్భుని నిట్లని వేడితిని.

చ॥ నరతతిచేత, దేవతగ ♦ ణంబులచేతను, బాణపంక్తిచేఁ
బరగమృగాళిచేత,నిల ♦ వాయుజలాగ్ని నభంబులందు, రా
త్రిరి పగలందు,గేహమున ♦ తేకువ,బాహ్యమునందు, నెన్నడుం
మరణముగల్గకుండగను ♦ మాన్యచరిత్ర! వరంబొసంగవే ॥

భక్తమనోభీష్టప్రదాతయైన నావిధాత నా కోరినవరంబు



లొసంగి యంతర్ధానుండయ్యె.

హిర— దేవా! నేటికిమేముధన్యులమైతిమి. దేవేంద్రాదుల గర్వమడఁచి పగఁదీర్చుకొను సమయము దొరకినది. ఇక నామాయవిష్ణువు మీజోలికి రావెఱచును సుమీ?

హిర— మంత్రులారా! ప్రసంగమున మఱచితిని. పుత్రుసమరణానంతరదుఃఖార్తయగు మాతల్లియు గర్భవతియగు నాయిల్లాలునుఁజూడ నుత్సాహముగలుగుచున్నది. వారలఁగని క్షేమమరసి పందిరూపమున నాసోదరునిఁజంపిన, యావాడువిష్ణునిఁబట్టి బరిమార్పఁగడంగెద. మీరును సర్వసన్నాహములతో యుద్ధసన్నిద్ధులైయుండుడు.

మంత్రి— చిత్తము ఆలాగే వెళ్ళవచ్చునుగాని ... ... ...

హిర— ఏమి "గాని" యనుచుంటివి? వారలు క్షేమముగాలేరా? లేక నేలేనితఱి శత్రువులెవరైన వారలసంకటపఱచి యుండిరా?

మంత్రి— దేవా! మీరుతపస్సునకరిగినపిదప నొకనాఁడు దేవేంద్రుఁడాకస్మికముగా మనపురంబున దండువిడిసినాఁడు.

హిర— ఏమేమి? దేవేంద్రుఁడే వచ్చినాఁడుగా? ఏమిరా వానికండక్రొవ్వు. హిరణ్యకశ్యపుని ప్రతాపమును మఱచినాఁడు గాఁబోలు. కానిమ్ము కొలఁదికాలములోనే వానిగర్వమడఁచెదను. తరువాత.

మంత్రి— మేమాతనితో ఘోరరణమొనరించితిమి గాని రాజులేనికయ్యమగుట మాప్రయత్నము లేమియు సాగిరాకఁబోవుటచే నగరునుగొల్లగొనియె.

హిర— దండువిడియుటయేగాక మీతో నెదుటబడి పోరుసల్పి నగరుఁ గొల్లగొనెనా?

గీ॥ కొలఁదికాలములోన నే • గ్రొవ్వుఁబట్టి
కనకకశ్యపుమాటయే • మనసునందుఁ
దలఁచకయ్యారె యెంతటి • ధైర్యమతియొ
చూరఁగొనిపోయెమత్పురి • శూరునిగతి ॥

కానిమ్ము వానికాలము సమీపించఁబట్టియే వానికిట్టిబుద్ధి పుట్టినది. తరువాత.

మంత్రి— త రు వా త దే వా?

హిర—ఏమట్లునీళ్లుమ్రింగెదవు? జరిగినదేదియో దాచకఁజెప్పుము.

మంత్రి— దేవా! అప్రియములు నుడువఁజాలక శంకించుచున్న మమ్ము క్షమింపుము.

హిర—ఏమీ! ఇంతకంటెనప్రియమా? అంతఃపురకాంతలనేమైన నసెనాయేమి?

మంత్రి—దేవిగారిని చె ఱఁ గొ.........

హిర— ఆఁ! ఎంతకర్ణకఠోరమగు వార్త వినవలసివచ్చెను. కాలమహిమ. హిరణ్యకశ్యపుని మేనప్రాణములుండఁగనే వానికులకాంత పరులచేఁజెఱఁగొనిపోఁబడియెఁగా! హా ప్రాణేశ్వరీ! నేనుజీవించియుండఁగనే నీకెంతటికష్టదశ ప్రాప్తించినది.

చ॥ కనకపురమ్యహర్మ్యములఁ • గాలుఁగదల్పక నెల్లసౌఖ్యముల్
గనుచుపరాభిలాష మది • గాంచక కశ్యపుముద్దుకోడలై
దినములుపుచ్చునిన్ను నొక • "దీనుఁడువచ్చి పరాభవించినాఁ
డని" వినవాయె నేటికక • టా! విధియెట్టి దురాత్ముఁడో సఖీ ॥

హా! పతివ్రతాశిరోమణీ! ఆదేవతాధములు నీకెట్టికష్టములఁగల్పించిరో? నీవెంతయడలుచుంటివో? అవును నాకట్టికష్టదశ రాఁగలిగినదే! కరుణలేక నెందఱెందఱినో కాంత



లనుఁబల్మిఁబట్టితెచ్చి చెఱఁబెట్టిన పాపంబూరకపోవునా? ఛీ పాకుమవమా! పౌరుషహీనఁపుమాటలఁబల్కుచుంటివిగా?

ఉ॥ శూరతఁజూపి శాత్రవుల • స్రుక్కఁగఁజేసి మదంబడఁచియున్
వారలుజూచుచుండఁగనె • వారిపడంతుల దెచ్చినాఁడ నీ
తీరున నింటలేనితఱి • ధీరతఁజూపుచుఁ దెచ్చినాఁడనో
క్రూరమనంబ! యిట్టివిధఁ • గూడనిపల్కులఁబల్కఁజెల్లునే॥

శూరుండనైన నేనింటనుండుతఱి వచ్చినాయింతినిఁ జెఱఁగొనిపోయిన బాగుంటనుగాని యింటలేకుండుటెఱింగి, కంటగించి, నాయింతినిఁ జెఱఁగొన్న నాతుంటరిని, నాకంటిమంటల మంటఁగలుపకున్న నాపౌరుషంబేల? కాల్పనా? ఛీ! క్రూరా! దానవవైరీ! మహేంద్రా!

గీ॥ తన్నుగట్టఁద్రాళ్ళుఁదాఁ • దెచ్చుకొనురీతిఁ
జూచిగోతిలోనఁ • జొచ్చునట్టు
లెఱిఁగియుండినన్ను • నెంతటికార్యంబుఁ
జేసినాఁడవౌర • సిగ్గుమాలి ॥

నీయంతము సమీపించఁబట్టియే యెఱిఁగి యెఱిఁగి నాకోపానలమునకిట్టి తుచ్ఛకార్యములనునింధనంబులువేసిమఱింతప్రజ్వరిల్లఁజేసితివి. నీచా! పౌరుషజ్ఞానవిహీనా! దొంగరండా! ఇదే నాప్రతిజ్ఞ వినుము.

* చ॥ జలనిధులింకఁగాక రవి • చల్లదనంబువహించుఁగాక యీ
కులగిరులెల్లస్థానముల • గొబ్బునవీడి చలించుఁగాక నా
జలజసుగంధి నాతగుణి • సత్కరుణన్ విడుమంచువేడినన్
ఖలుఁడ! మదీయఖడ్గమున • ఖండనఁజేయక వీడనిన్నికన్ ॥

మంత్రులారా! వినుచుంటిరిగదా నాఘోరప్రతిజ్ఞ! ఇప్పు

డే స్వర్గమును ముట్టడింపఁ బయనముగుండు. ఆ శుభమాధముండు

ఉ॥ జాలియొకింతలేక భుజ • సారమటంచుఁ దలంచి నిండుచూ
లాలిని బల్మిఁ బట్టి చెఱ • యందునఁ బెట్టినదుష్టచిత్తునిన్
గూళను దుర్మదాంధు నిట • గొబ్బునఁ దెచ్చి వధించి ప్రీతిమై
చాలఁగ మాంసభోజనము • సల్పెద మీరలు సంతసింపఁగన్ ॥

వారముదినములలో నేనీపనిఁ గావింపనైతినేని నన్నీపేరు నఁబిల్వకుఁడు. నేను బ్రహ్మచేఁ బొందినవరములు వరములు గావు. రెండు మీరు ప్రయాణసన్నాహులుగుండు.

సేవ—(ప్రవేశించి) దేవా! నారదుఁడు దేవిగారితోడను పుత్రునితోడను వచ్చుచుండ నడ్డగించిన ద్వారపాలకుల నదలించి, తోడ్కొనివచ్చితి.

[ప్రవేశము నారదుఁడు, లీలావతి, ప్రహ్లాదుఁడు.]

నార—ఔరా! దేవేంద్రునిచేఁ జెఱఁగొనిపోఁబడు కాంతను గైకొని రాజున కొప్పగింప నరుదెంచు నాప్రవేశమునకే కష్టమైనపెర వారల మాటలడుగనేల? ఏమి యీసేవకుల తెలివిహీనత.

ఉ॥ పొట్టకుబట్టకై నసరి • పోవక ఘోరతరోపవాసముల్
దిట్టతఁ జేయుచుండినను • తెల్వి విహీనత స్వర్గసౌఖ్యమే
గట్టిగఁ గాంచినామనెడి • గర్వముఁ జెందుచు సజ్జనాళినిన్
బెట్టుచునుంద్రు బాధల వి • వేక విహీనులు నీచసేవకుల్ ॥

గడ్డియో కంపయోదిని సంపాదించియొసంగిన పిత్రార్జిత ద్రవ్యముల లంచములకై వెచ్చించుటచేఁ బడసిన నీచసేవకావృత్తికే గర్వపడుచు



గీ॥ తమ్ము మించువారు • ధరణిలో లేరని
విఱ్ఱవీగుచుండి • వెఱ్ఱులగుచు
సాధు జనులనింద • సల్పుచుందురుగాదె
క్రూరజనములెల్ల • గొంకులేక ॥

"రాజానుమతే ధర్మః" అనునట్లు వానిసంరక్షణలోనున్న వారగుటచే వారి యిష్టానుసారము ప్రవర్తిల్లకతప్పదుగాని, ప్రజలకష్టసుఖంబుల నివేదించుటకు గౌరవార్థముగ నియమింపఁబడిన వారుగూడ జీతము, భత్యము లేనికొలువునకే విఱ్ఱవీగుచు ప్రజలక్షేమమరయుటకు మారు వారలఁ గష్టపెట్టుచుండుటే ప్రధానకార్యముగఁ గొని, తమనీడనుఁ జూచుకొని తామే సంతోషపడుచుఁ బ్రపంచమును క్రిందుమీఁదుఁ జేయఁ జూచువారి తెలివి నేమందును? పోనిమ్ము; అదియంతయు మనకేల? ఎవరిపాపము వారే యనుభవింతురు. అమ్మా! లీలావతీదేవీ! అదుగో, నీనాథుఁడు పోయి సుఖంబుండుము.

లీలా—నాథా! రక్షింపుము! రక్షింపుము! (అని పాదములపైఁ బడును)

హిర—ఇంతీ! చింతింపకుము. (లేవనెత్తి) ఇప్పటికిఁగదా నాకన్నులు చరితార్థత నొందె నా యర్ధాంగిని క్షేమముగఁ జూచుభాగ్యము లభించినది. దేవీ! యీనిర్భాగ్యుని భార్యవైనకతమున నీకెన్ని యిక్కట్టులు ప్రాప్తించె. కండక్రొవ్వియా శచీనాథుఁడు నిన్నే చెఱఁగొనిపోనెంచెనుగా; కానిమ్ము వానిసంగతిఁ గనుఁగొనియెదఁగాని నీవృత్తాంతమేమియో దెల్పుము. విని తగినట్లు ప్రతిక్రియఁ జేసెద.

లీలా—నాథా! అట్లు మీరు తపమునకై వెళ్ళిన కొలఁదిదినంబులకమరవిభుఁడు మనపురముపై దండెత్తిరాఁగా ధైర్యసాహసము

లనెపరొక్కన్న ననుజనేలఁ జీకాకుపఱచి గర్భవతిల గర్భచ్ఛేదన మొనరించి నన్ను చెఱగొని పోనెంచ నీనారదఋషీంద్రుని సత్కృపచే నాయాపత్సముద్రమును దాటఁగలిగితిని. ఈపుణ్యశాలియడ్డుపడి వారించకున్నఁ దక్కినవారివలెనన్నుఁగూడ నట్టి క్రూరకృత్యముఁ గావింపక విడువడు. అప్పుడీపుత్రుఁడు మీకుదక్కకఁబోవును.

ప్రహ్లా—నాన్నగారూ! అమ్మనువిడిచి మీరెందుఁబోయితిరి. నావందనములఁ గైకొనుఁడు.

హిర—(పుత్రునెత్తి ముద్దాడి) కాంతా! ఎంతదుఃఖముగలిగియున్ననుఁ బుత్రునిఁజూచిన నవియన్నియుఁ బోవుగదా?

సీ॥ సంసారదావాగ్ని • శౌర్యగర్వముడంపఁ
దనయుఁడేఘోరశీ • తాంశుఁడవని
పున్నామనరకకూ • పోద్ధతిలుగఁజేయ
సూనుఁడేదగిన • సోపానపంక్తి
సకలమనోదుఃఖ • సాంద్రాటవి దహింపఁ
బట్టియేబహుళదా • వానలం...
తన్మాత్మకృతసద్వ • తఫలములొనగూర్పఁ
బుత్రుఁడేసంతాన • భూరుహంబు
పుత్రుఁడేజీవనమొసంగు • పూజ్యుఁడెన్నఁ
గొమరుఁడేయశస్సాగర • కువలయాప్తుఁ
డట్టిపుత్రులులేనివా • రవనియందు
శూన్యులునమాన్యదూరుల • నన్యులరయ॥

నారదా! నీవింకనట్లె మొద్దువలెనిలుచుంటివా? యీపీఠమలంకరింపలేమి?



నార—(తనలో) ఔరా! దుర్మార్గులకుయుక్తాయుక్త విచారణలుండునా? నేఁజేసినమేలునకిది ప్రత్యుపకారముగాఁబోలు? కానిమ్ము. వీనిగర్వము వీనిఁజెఱుపకమానదు. గర్భములోనున్న శిశువునకుఁ దారకమంత్రముపదేశించి కలహబీజమును నాటితిని. విషనదియేవృక్షమై పిండెలఁగాయలతో శోభిల్లకమానదు. (ప్రకాశముగ) దానవేంద్రా! ఆలాగే!

హిర—నారదా! నాదెబ్బనుగుర్తెఱింగిన దేవేంద్రుఁడు నిర్భీతిగనపుడు గర్భవతియగునా యర్ధాంగిని చెఱగొనిపోయిన నుద్దేశమేమైయుండును.

నార—ఉద్దేశమేమిగలదు? తపముఁజేయఁబోయిన మీరుతడవుమసలుటచే హరిచేనంతమొందినారని యెంచి, సంతోషించుచు నీకమీఁదఁ భూమిపై దానవయంకురంబులేకుండఁ జేయవలెనని యూహించినట్లుగావించినాఁడు.

హిర—సరే. ఎంతయోచన! కానిమ్ము. ఇప్పుడేపయనమైపోయి వానిపనిఁగనుగొనియెద. దేవీ! పుత్రునిఁగొని నీవంతిపురమునకుఁబోమ్ము. నారదా! నీవునావెంటరమ్ము.

(నిష్క్రమించుచున్నారు)

## ద్వితీయాంకము.

### ద్వితీయరంగము.

——(౦)——

మహేంద్రునాస్థానము.

ప్రవేశము:— మహేంద్రుఁడు, బృహస్పతి.

మహే—ఆచార్యా!

చ॥ పనిగలదంచువార్తలనుఁ • బంపినఁగానమదేమొ;దిక్పతుల్
మనమునలెక్కసేయరణు • మాత్రము వారలునింపఁగారు కా
రణమదియేమొ దోఁచదు;సు•రాధిపపూజిత! మీరలెంతెఱుం
గనిపనులుండఁబోవుగద • కావునఁదెల్పుఁడి సంశయింపకన్॥

బృహ—మహేంద్రా! వారు మీయందనాదరణ భావమునుగలిగిన వారనుటపొరబాటు; మహోత్కారణ మేదియో పొసంగియుండవలె.

ఇంద్రు—మహత్కారణమేమిగలదు?

బృహ—మహేంద్రా! చెప్పుమఱచితి. బ్రహ్మచే వరములందివచ్చిన హిరణ్యకశ్యపుఁడు దుర్మదాంధుఁడై దిక్పాలురపట్టణముల పైదండువిడిసెనని వినియుంటిని. ఆపాపకర్ముని బారిఁబడియుండుటచే మీయాజ్ఞలనిర్వర్తింపఁ జాలకుండిరని తలంచెద. వానిచేత వారెట్టిబాధలఁబడుచున్నారో?

ఇంద్రు—(ఆశ్చర్యముతో) ఏమీ? వరంబులంబడసి యారాక్షసాధముఁడు మరలివచ్చెనుగా? ఈరాక్షసాధమునిబాధ యెప్పటికి దీరునట్లులేదే? గురువర్యా!



మ॥ "అనుజుఁ జంపెనువిష్ణువం"చుమదినా • హంకారతన్ సత్తపం
బునుఁగావించి వరంబులంది"హరినే•పోకార్చెదన్ జూడుమా"
యనిఘోరాటవి జేరిరాక మసలన్ • యందేహతుండాయెనం
చనియూహించితినెట్లువచ్చెనకటా!•యాచార్య! వేదెల్పుమా?

బృహ—ఎట్లువచ్చెనోయననేల? వేల్పుపెద్దవివేక శూన్యతవల్లను మనదౌర్భాగ్యమువల్లను.

మహే—ఆచార్యా! వాస్తవమే? కాకున్న

గీ॥ వామహస్తము,కైవడి • వణకుచుండు
ననుజుఁడీల్గిననెంటిమై • యుండలేక
నుండియునుదానుజడియక • మెండుగాను
వరములనుఁగాంచి యేరీతి • వచ్చుమరల ॥

వానిమాటఁదలఁచిన గుండియలదురుచున్నవి.

బృహ—మహేంద్రా! రానున్నయాపదలు భీతిల్లినరాకమానునా?

మహే—గురువర్యా! అందుకుఁగాదు. ఈతఁడాదినుండియు మనకు శత్రువర్గములోనివాఁడగుటచేతను క్షమాగుణరహితుఁడగుటచేతను వానిమాటయే భయోత్పాతదాయకమై యుండ

గీ॥ తపముఁ జేయఁగఁబోయిన • దానవుండు
యొంటిగాఁజిక్క శ్రీహరి • కంటగించి
జంపినాఁడనియెంచినే • సాహసమున
నతనిభార్యనుచెఱఁగొన • నరసినాఁడ ॥

బృహ—అబ్బా! ఎంతసాహసమొనరించితివి. ఇట్టిఘోరకృత్యములు మనము జేయవలసినవేనా? దాననీయుద్యమమేమి?

మహే—దానవసంతతిలో మిగిలియున్న నీదుర్మార్గుఁడు గతించినాఁ

షు గదాయని యెంచి "గర్భవతియగు నామెగర్భముననర
కుఁడేపుట్టి, తాతతండ్రులవలె మనలనెట్టి దుర్భరవేదనల పా
లఁబడఁజేయునో" యనుభయమునఁబుట్టిన పట్టినివెంటనే పి
లుకమార్చి ధారుణిదానవాంకురంబులేకుండఁ జేయవలెనను
తలపున.

బృహ—మహేంద్రా! నీయూహసరియైనదికాదు. విషదంష్ట్రలుగల
కాలాహిశిరమున మణు లుద్భవించునట్లు ఖలులకడుపున ను
త్తములుగలుగఁగూడదా? తరువాత.

మహే—మనయభాగ్యదేవత మూర్తీభవించెనోయనునట్లు మాయ
లమారి నారదునకావార్త యెట్లుతెలిసెనో, నాయత్నము
నకడ్డువచ్చి లీలావతినిచెఱవిడిపించి రాక్షసరాజుమన్ననలందఁ
గొనిచనె. "ఆకలహాసనుండాకెతనాత్మునకెట్టికానిమాట
లఁదెల్పి, లోకద్రోహికిఁన త్రాచునుఁజేయునో"యని దిగులగు
చున్నది.

బృహ—అయినను మనమిప్పుడేమిచేయఁగలము. కాలానుగుణము
గాఁగర్తవ్యమూహించుకొని ప్రవర్తిల్లవలెఁగాని వగఁజెం
ది ప్రయోజనమేమి? ఎవరోవచ్చుచున్నట్లున్నది.

(ప్రవేశము యముఁడు)

మహే—ఓయీ దండధరా!

యము—మహేంద్రా! ఇంకెక్కడిదండధరుఁడు. ఇఁకనన్నాపేరుఁ
బిల్వకుడు.

మహే—(ఆతురతతో) దిక్పాలకశ్రేష్ఠమా? నేఁడేల నింతవిసుగుగా
మాట్లాడుచుంటివి? మీక్షేమమునకేమైన కొఱఁతగల్గెనా ?



యము—దనుజాధములుబ్రతికియున్నంతసేపుమాకెక్కడిక్షేమములు?

ఇంద్ర—ఏమట్లనుచున్నావు? మీరేమైన రాక్షసబాధితులైతిరా?

యము—వేఱుచెప్పవలయునా? హిరణ్యాకశ్యపుఁడు

గీ॥ పీసెగుద్దులతో మాకు ♦ విఁసుజేసి
కదలమెదలంగలేనట్లు ♦ గానొనర్చి
తృప్తులనుఁజేసె నిప్పుడు ♦ తీక్ష్ణమైన
వార్తలనుఁదెల్పఁగాఁబోలు ♦ వదలినాఁడు॥

ఆసమాచారముఁదలఁచిన గుండెలు పగిలిపోవుచున్నవి.

ఉ॥ నేనిటులాడునంచు రజ ♦ నీచరుచేతులఁజిక్కి స్వప్నమం
దైనఁదలంచనైతినక ♦ టా! "యమధర్మునకిట్టులైన వై
శ్వానరముఖ్యులేగతిని ♦ బాధలనొందుచునున్నవారొ? యా
దానవుబారిఁజిక్కి"యని ♦ దైన్యముగల్గుచునుండెనయ్యయో

అబ్బా! అప్పటినాయవస్థ పగవానికైనను రాఁగోరనుసుమా?

గీ॥ దానవులచేతఁజిక్కిన ♦ వాదిగాఁగ
నెవరిఁగనుఁగొన్న దానవుఁ ♦ డేయటంచుఁ
దలఁచియబలలరీతిగ ♦ దాగియుంటి
నెట్టులొచ్చితొ నేనిందు ♦ నెఱుఁగనకట॥

వచ్చినానో లేదో, యముఁడనోకానో? దానవులా? మీరెవ
రు? నాతో మీకేమిపని? నేనుయముఁడనేనా?

మహే—ఓయీ దండధరా! ఆరాక్షసాధములచేఁగలిగిన బాధలచే
మతిదప్పెనా యేమి? నిన్ను నీవేయెఱుఁగనట్లు మాట్లాడుచు
న్నావు? మనసుకుదుటపఱచుకొనుము. నేనుమహేంద్రుఁడ
ను. ఈతఁడు దేవగురువు.

యము—ఏమీ! నీవింద్రుఁడవా? నేనుయముఁడనేనా? (తలఁదడు

వుకొనుచు) నా దిబోడినెత్తి కాదే? రాక్షసులచే మొట్టికాయలఁదిన్న యూవారికందఱికి బోడినెత్తులుండవలెనే? మీకట్లులేవేమి? నిజముగ మీరుమావారుకారు. దానవులే. నాజోలికిరాకుఁడు. ప్రణామిల్లెదను.

మహే— ఓయీ! తొందరఁజెందకుము. నిదానముగ మనసు శాంతిఁ బఱచుకొనుము. నేనునిజముగనింద్రుఁడనే భయపడకుము. యేరివంకఁజూడుము?

యము— ఆచార్యా! వందనములు. దానవులునన్ను బాధించుచుండ మీరుగుండియుఁజూచి యూరకుండుటుచితమేనా?

బృహ— మహేంద్రా! ఇతఁడు రాక్షసబాధాకలితస్వాంతుఁడై యాతురతలోనున్నాఁడు. కొంతతడవు విశ్రమించనిమ్ము. వృత్తాంతమరయుదము. దండధరా! యూపీఠమలంకరించి సెదఁదీర్చుకొనుము.

యము— శ్రమఁదీర్చుకొన్నను తీర్చుకొనకున్నను, నొక్కటియే. ఆపీసెగుద్దులప్రభావమెట్టిదోగాని యొక్కొక్క యన యవము రెండేసియై స్మారకముదప్పి పరమసుఖమనుభవించితిమి. ఆపాడుబ్రహ్మనన్నెక్కడనైననొక యమాయకునిగఁజేయకదండనాథునిగ నేలపుట్టించెనోయని వగచుచున్నాను.

మహే— అన్నన్నా! ఎంతకష్టమెంతకష్టము. ఆవృత్తాంతమంతయు సవిస్తరముగ నెఱింగింపుము. ఆకనకకశ్యపుఁడేమిజేసెను? వానియనుచరులేమి జేసిరి?

యము— మహేంద్రా! ఇంకనాపేరెత్తకుము. ఆపేరు విన్నమాత్రముననే నాకెక్కడలేని భయసంభ్రమములుగలుగుచున్నవి.

మహే— భయపడకుము. భయపడకుము.



యము— త్రిలోకాధినాథా! శ్రమలఁబొందువారు తాముగాకున్న శాంతిమాటలెన్నియైనఁ జెప్పవచ్చు.

గీ॥ కాలుచున్నదితనయొడల్ ♦ కాకయున్న
వట్టిమాటలఁజాలఁగాఁ ♦ బలుకవచ్చుఁ
జెప్పువారలకనుభవ ♦ సిద్ధమైన
తరుణమందునాస్థితి ♦ నెఱుఁగఁగలరు ॥

ఇంద్ర— నేసందుకనలేను. శాంతిఁబొందక మనము జేయునదేమున్నది?

యము— చేయవలసినదంతయుఁ జేసినారు. అవధరింపుడు.

సీ॥ పట్టిజట్టీలను ♦ బంధించిగుదియల
గట్టిగాఁదలలపై ♦ మొట్టినారు
సింహాసనంబును ♦ జెఱచి నాపాశంబు
భగ్నంబుఁగావించి ♦ బాదినారు
నగరంబునంతయు ♦ నాశనంబుగఁజేసి
నారీమణులఁజూచి ♦ నవ్వినారు
చిత్రగుప్తునిఁజీరి ♦ చెప్పులెక్కలటంచు
చెంపదెబ్బలఁగొట్టి ♦ పంపినారు

గీ॥ తెలియజెప్పంగఁజాలనో ♦ దివిజనాథ!
చేయవలసినపనులెల్లఁ ♦ జేసినారు
మిక్కుటంబుగమమ్ము నెల్ల ♦ దిక్కులేని
పక్కులుగనెంచియెనలేని ♦ బాధలిడిరి ॥

ఇంద్ర— అక్కటా! మహామహులగు దివిజులకెంతటియాపద ప్రాప్తించినది! తరువాత—

యము— తరువాతనేమున్నది? మాకుఁబిడిగుద్దులతో శరీరమంతయు నిండిపోయినది. ఆగుద్దులచప్పుళ్ళు మీకిక్కడికివినఁబడియే

యుండు ననితలంచెద. ఆహా! టలిఁకదలఁబెట్టకుఁడు.

ఇంద్ర—ఇప్పుడు భయపడవలసినపని లేదు. ఆపదలొచ్చినప్పుడు బుద్ధిమంతులు వానినిఁ బాపుకొనఁ బ్రయత్నించవలయుఁగాని, బెంగగొన్న ఫలమేమి? తక్కినవారిగతి యేమయ్యెనో సంగతి తెలియదయ్యె. ఆచార్యా! వినుచుంటిరిగదా కర్తవ్యమేమి

బృహ—అందఱిని రానిమ్ము. యోచించుకొందము.

యము—వారింకెక్కడ రాఁగలరు. ఆయార్తరవమేమి?

(తెఱలో)

ఓరోరి దేవతాధములారా! పాఱిపోకుఁడు పాఱిపోకుఁడు. నిలు నిలుండు. మహేంద్రుఁడెందున్నాఁడు? సర్వదిగంతర ప్రతాపానల జేగీయమానశౌర్యధుర్యుండగు కనకకశ్యపుని బారిఁబడి తప్పించుకొని పోవమీతరమగునా?

ఇంద్ర—(వణఁకుచు) ఆచార్యా! రాక్షసుఁడిటుగూడ వచ్చుచున్నాఁడు. ఇఁకఁ గర్తవ్యమేమి?

యము—“పూనినకర్మము పూఁబడచినను పోదను”నట్లు నాగ్రహచారమింకను నన్నువదలనట్లున్నది. ఏది వెరవు?

బృహ—మహేంద్రా!

గీ॥ రణముఖంబునఁ బాఱిపో • రాదుటొకటి

యము—అదికల్ల. అప్రయత్నులమైన మనము వానితోఁ బోరాడఁగలమా?

బృహ—అట్లయిన

“శరణుశరణ”ని వానికి • సర్వమొసఁగి

వనములకుఁబోయి సుఖములఁ • బడయుటొకటి

యము—ఇప్పటికీయుపాయము బాగున్నది. “బ్రతికియుండిన సుఖములఁబడయవచ్చు”నను పెద్దలసామెతలు వినియుండరా?



మహే—అట్లైననుగౌరవ • హాని గాదె ॥

బృహ—ఏమైననుసరే? ఇప్పట్టున వానితో యుద్ధమొనర్చుటమాత్రము సమంజసముగాదు. వాఁడు బ్రహ్మచే వరములఁబడసి యజేయుఁడై యున్నవాఁడు. అట్టివానితో మనము రణమొనర్పఁ జాలము. సంధిఁ గావించుకొనుటయే యుత్తమోత్తమము.

ఇంద్ర—గురువర్యా! “అపజయముగల్గునని” భీతిఁగల్గిన మీరనినట్లు తగినతావులఁ దలఁదాచుకొనుటయే యుత్తమము. అందునకు నాకొక యోచనబొడకట్టుచున్నది. ఏమనిన:—మీరలింకుండి యీరాక్షసాధమునకుఁ దగినట్లు సామదానముల చేత సమాధానముఁ జెప్పుడు. మేము సకలదీనజనావనపరాయణుండగు శ్రీమన్నారాయణుని శరణుఁజొచ్చి మనయీ ఘోరవిపత్తులఁ దెలిపి సాయముగాఁ గొనివత్తుము. ఇంతకన్న వేఱుమార్గమగుపడదు.

బృహ—మీవిషయమై యగ్నిలోనురుకమన్నను యడ్డుచెప్పను. అయిన నొకమాట, అమృతభాండము, కామగవి, ఐరావతము, అంతఃపురకాంతలాదిగాఁగల వారిగతియేమి?

ఇంద్ర—వారలఁగూడ వెంటనేగొనిపోయెద.

బృహ—సరే. దానవుఁడిందు రాకమున్నె యట్లుగావింపుడు.

(నిష్క్రమించుచున్నారు.)



# భక్తవిజయము



## తృతీయాంకము.

---

(ప్రవేశము — వజ్రఘాతకుఁడు)

వజ్ర—స్వర్గముపైదండుఁ వెడలిన మహారాజుగారు నేఁడుదయమున నే వచ్చినారు గాన నచ్చటివిశేషములరయ నాకెంతోయుత్సాహముగనున్నది. నేనుగూడ రాజుగారి వెంటఁబోవలెనని ప్రయత్నపడితినిగాని కొనసాగినదికాదు. అదే మావక్రదంతుఁడిటేవచ్చుచున్నాఁడు. వానినడిగినసర్వముఁదెలియఁగలదు వక్రదంతా? ఎప్పుడువచ్చితివి? స్వర్గవిశేషములేమి?

వక్ర—(మాట్లాడకఁబోవును)

వజ్ర—ఏమబ్బా! మాట్లాడకబోయెదవు; స్వర్గసౌఖ్యములననుభవించినగర్వమా యేమి?

వక్ర—ఉండరా? స్వర్గమూ లేదు - సౌఖ్యమూ లేదు.

వజ్ర—ఏమిరా? అట్లనియెదవు? అమృతభాండమేమయినది. "నిజముచెప్పిన నేనుగూడ భాగముకోరుదు"నని యాయేమి? దానిమాటయట్లుంచి కామధేనువనిచెప్పుచుందురే; దానినిఁ జూచినావా? రంభ మేనకాది యచ్చరలతో సౌఖ్యమనుభవించితిహా?



వక్ర—రంభా లేదు- గింభా లేదు. వారేమి తెలివితక్కువవారలా? మనరాజుగారు తొలుతనే నరకము ముట్టడించి తదాధ్యక్షుడగు యముని భరతముపట్టించిరిగాని వాడెట్లులో మమ్మేమరచి తప్పించుకొనిపోయె యింద్రునకావృత్తాంతముఁజెప్పినాఁడు కాఁబోలు? తరువాత మేముదిక్పాలుర నొక్కరొక్కరిగ బనిచూపుచు స్వర్గమునకేగుసరికా యింద్రఘాతకుడక్కడ నొకపూచిక పుల్లనైన నుంచక గొనియెందోచనినాఁడు. మహారాజుగారును పుత్రుని యక్షరాభ్యాసమొనరించు శుభముహూర్తదినము రేపేయగుటచే మఱియొకసారి చూచుకొందమని వారిమాటయెదలంచక వెనుకకుఁదిరిగివచ్చిరి. ఇదియేజరిగినవృత్తాంతము. (ఆలకించి) రాజుగారు కొలువుకూటమునకరుదెంచిన సందడులువినవచ్చుచున్నవి. యిఁకఁదడవుసేయరాదు. పోదముపద.

వజ్ర—సరే పోదము.

(అని నిష్క్రమించుచున్నారు)

(ఇది విష్కంభము)



## ప్రథమరంగము.



(ప్రవేశము హిరణ్యాక్షప్రభుఁడు, మంత్రి, చండామార్కులు.)

హిర—మంత్రులారా! అదేమియోగాని నాపుత్రుని చరితముబ

హాచిత్రము గానున్నది.

క॥ పిలచినఁ బలుకఁగ నెల్లడు;
పలికినఁ బెడరీతిగాను ♦ భాషించును నా
వలను దలంపకు తనకే
తలఁపో యున్నట్లుగా వ్య ♦ ధగ వర్తించున్ ॥

కుబ్జతనంబున నెన్నో కోరిక లుండవలయునే? అలంకారముల నెల్లడు నిధినిక్షేపములొసంగినను గైకొనక సీలోక సౌఖ్య మిచ్చగింపని విరాగివలెను వెఱ్ఱివానిచందమునను

సీ॥ ఒంటరిగా నేగి ♦ యొక్కచోఁగూర్చుండి
కిలకిలనవ్వును ♦ కొలఁదిసేపు
యొంటరిగా నేగి ♦ యొక్కచోటనుఁ జేరి
తనలోనఁ దానేమొ ♦ దలఁచుచుండు
నొంటరిగా నేగి ♦ యొక్కచోటనుఁ జేరి
పరవశంబుననేమొ ♦ బల్కుచుండు
నొంటరిగా నేగి ♦ యొక్కచోటనుఁ జేరి
యుబ్బిగంతులువైచు ♦ నుత్సుకమున
యొక్కచోటనుఁ గూర్చుండి ♦ వెక్కివెక్కి
యేడ్చుచుండును మొగమెల్ల ♦ మూడ్చుకొనుచు
నట్టెనిలుచుండి నేదియో ♦ హర్షమునను
జూచుచుండును మింటికిఁ ♦ జూడ్కునిలిపి ॥

లేక లేకకలిగిన సంతానమిట్లులాయెననే నాకతిదుఃఖమగుచున్నది. అతనిబుద్ధివైకల్యమును నీవునువినియుందువు. అట్లగుటకుఁ గారణమేమైయుండునో?

మంత్రి—దేవా? లోకమున గొడుకవివేకియైనఁ దల్లిదండ్రులకుఖేద



మును, వివేకియైన మోదమునుగలుగుట స్వాభావికముగదా?

చండా—రాక్షససార్వభౌమా? మీముద్దులకుమారుఁడు విద్యాశూన్యుడగుటచే వివేకరహితుఁడై మూఢతనున్నాఁడు. విద్యనేర్పించిన సదసద్వివేకియగును విద్యామహిమలెంతని గొనియాడగలము.

హిర—అవును నిజమే

సీ॥ అజ్ఞానతిమిరంబు ♦ నణగింపగాజాలు
విద్యయేతగువైన ♦ వెలుగుసుమ్మి.
రాజాధిరాజుల ♦ పూజలందుటకెల్ల
విద్యయేతగువైన ♦ విధముసుమ్మి
వినయాదిసద్గుణా ♦ న్వితుఁడనఁబరుటకు
విద్యయేతగువైన ♦ వీలుసుమ్మి
ఇహపరసౌఖ్యమ్ము ♦ లిచ్చిపోషింపంగ
విద్యయేతగువైన ♦ విత్తమరయ
విద్యయేగదపరదే ♦ శవిహితుఁడెన్న
విద్యయేసర్వభూషలు ♦ విపథవిధులఁ
జూడ "విద్యావిహీనః ప ♦ శుస్సదా" య
నంగవినమొకో మనమెల్ల ♦ నయసుశీల॥

కనుక నే మీతండ్రిగారును సుభలగ్నమేర్పాటు చేసినదినమున

చ॥ చదివిన వాఁడెబుద్ధిగని ♦ సర్వమెఱింగి మనీషియౌనుగా
చదువఁగ వేయుమా, తనయుఁ ♦ జయ్యనననంచని దెల్పినాకునా
మదిగలఖేదమంతయును ♦ మాన్పెనునీజనకుండు కూడనో
సదయువిచార! మీరనిన ♦ సంగతిదానికిఁ దోడునీడయే ॥

తండ్రికుమారులయుద్దేశంబునకు భేదముగలుగునా? సరే

బాగున్నది. నేడే లగ్నదినము. వేళమీరకమున్నే, బాలునిపాఠశాలకుఁగొనిపోవ ప్రయత్నమొనరింపుము. సేవకా! నీవేగి ప్రహ్లాదునిచెంతఁ దోడ్కొనిరమ్ము.

సేవకు—చిత్తము. (అనిబోయి ప్రహ్లాదునితోఁ బ్రవేశించును)

ప్రహ—తండ్రీ! నమస్కారములు. గురుపుత్రా! వందనములు.

హిర—(దగ్గఱకుఁదీసుకొని) నాయనా! నీముద్దుమాటలు నాకెంతయు ముచ్చటఁగలిగించుచున్నవి. మనవంశమునకు గురుపుత్రులైనను నీకుమాత్రమటుగాదు. వారునీకుగురువులే. వారివద్దవిద్యాభ్యాసమొనరించి కీర్తిమంతుఁడవుగమ్ము.

ప్రహ—తండ్రీ! మీయాజ్ఞకన్యథాప్రవర్తింతునా?

హిర—ఆచార్యపుత్రా! విద్యాపూజకేగుదముగాని ముందుగానామనవి యొకదానినాలింపుము.

ఉ॥ బాలుఁడుపిన్నవాఁడుచను ♦ బాలనుఁద్రాగెడియీడువాఁడునే
గోలతెఱుంగనట్టిపసి ♦ కూనఁడుగావున గద్దరింపకే
జాలుగవిద్యలన్నిటినిఁ ♦ జక్కఁగనేర్పి యశంబుఁగాంచమీ
పాలనువేసినాఁడనిదె ♦ పండితవర్య! యనుగ్రహింపవే ॥

చండ—దేవా! మీరింతనొక్కి చెప్పవలయునా? నేనవివేకినా? లగ్నవేళసమీపించుచున్నది. పోదము.

(నిష్క్రమించుచున్నారు)

---

ద్వితీయరంగము.

(పాఠశాల. నాటకులయిష్టానుసారమేర్పాటు చేసుకోవలెను)

తృతీయరంగము.

---



తృతీయరంగము.

రాజమందిరము.

(ప్రవేశము హిరణ్యకశ్యపుఁడు, లీలావతి)

హిర—కాంతా! విద్యాశక్తిచే బాలుఁడయ్యు వారియిల్లుఁబాయక మనలనైనఁదలపెట్టకున్నాఁడు. నేనును రాచకార్యములలోఁ జిక్కియుండుకతన వానినిఁగూర్చియోచింపనైతి. నిన్ననీవు హెచ్చరించినది మొదలు వానినిఁజూడ నామనంబాతురపడుచు నేకార్యముఁజేయనొల్లకున్నది. రెండుమూఁడురోజులు జూడకున్నందులకే మనకింతమరపిల్లుచుండ లేని వారెట్లుందురో? నిజముగఁదనయులులేని కొంపవనతుల్యమేసుమీ?

లీలా—నాథా! అందుకుసందేహమేమి? ఎంతటికఠినాత్ములైనను సుతవియోగముభరింపగలరా? అందునగవారలెట్లైన భరింపఁగలరుగాని.

మ॥ నవమాసంబులుమోసి, పెంచి,కని,నా ♦ నారీతులన్ బ్రేమమై
బవలున్ రాతిరిపుత్రునేమమునకే ♦ భావించుచున్ గంటిరె
ప్పవలెన్ బాయకనుండుతల్లిభరియిం ♦ పన్ లేదుగాసుమ్మి వా
రివియోగంబును తప్పపాటయినవే ♦ రేజెప్పనింకేటికిన్॥

హిర—ఇంతీ! ఏమనుచుంటివి? తల్లులకంటెఁ దనయులపైఁ దండ్రికెక్కువ ప్రేమయుండదనియా? ఈమాటలెచ్చటనేర్చుకుంటివి ఎవరిమనసుప్రకారము వారలూహింతురుగదా?

లీలా—మాటకుమాటననెదరుగాని నిజముగబిడ్డలయందుఁ దండ్రులకన్నఁ దల్లులకేయెక్కుడుప్రేమయుండును. "మగవాఁడో మానో" యనుసామెతనెఱుంగరా?

హిర—సరే. అట్లేకానిమ్ము. ఎవ్వరుగాని వారిక్షేమమునకే జూ

తుసుగదా?

లీలా—నాథా! పుత్రునిఁ బలిపించెదనంటిరే? ఏఁడీ యింకను రాఁడాయెను?

హిర—నానికొఱకే నిరీక్షించుచుంటిని. వచ్చుచునేయుండును (పరిక్రమించి) అదిగో వచ్చుచున్నారు. మంత్రియు వచ్చుచున్నాఁడు.

మంత్రి—(ప్రవేశము) రాజమార్తాండా! అభివాదనములు.

హిర—అమాత్యమణీ! మనప్రహ్లాదుని విద్యాబుద్ధులరయ నూహించి నీకొఱకు పంపనుండు నంతలో నీవే వచ్చితివి. కూర్చుండుము.

మంత్రి—ఆవార్త నెఱింగియే వచ్చితి.

[ప్రవేశము ప్రహ్లాదుఁడు, గురువులు]

లీలా—అదె నాముద్దులపుత్రుఁడు నానేత్రోత్సవము చేయుచున్నాఁడు. ఏమి నాభాగ్యము (యెత్తిముద్దాడి) నీవిద్యామహిమలఁగనుఁగొనవేడుకపడుచున్న మీజనకుని మనోవాంఛఁదీర మమ్మానందింపజేయుమా.

హిర—గురుపుత్రా! కూర్చుండుము. కుమారా!

గీ॥ నీవు నేర్చినవిద్యల • నేర్పుజూపి
మోదమందఁగఁజేయుమా • ముద్దుకుఱ్ఱ!
గురువులేమెచదువులనుఁ • గూర్చినారొ
తెలియఁగోరఁగనున్నాఁడ • ధీరచరిత!

గురువులే మేటివిద్యలఁజెప్పిరో నీవేవిద్యల గ్రహించితివో మాకెఱింగించి దానిలోని యొక్కశ్లోకమునుఁ జదివి ప్రతిపదార్థముగఁదాత్పర్యమును వక్కాణింపుము.

ప్రహ్లా—తల్లిదండ్రులారా! నాకెంతకంటె నెక్కుడుభాగ్యమా! నేఁ



జదివినజదువులువిన మీకుమిక్కిలి కోరికగలుగుటచే నవినిజముగ సార్థకతఁజెందినవి. అయినను

ఉ॥ చెప్పిరియయ్యవారు తమ • చేతగురీతినివిద్యలెల్ల మీ
మెప్పునుజెందఁగోరుచు న • మేయపుశక్తినిఁజూపి యైననా
చెప్పినవిద్యలేమి మదిఁ • జేరవు సారవిహీనమౌటచేఁ
జప్పిడిగడ్డికూర తినఁ • జాలనియట్టుల దానవేశ్వరా!

గాని నాపూర్వాకృత పుణ్యవిశేషంబున మిమ్ములనానందింపఁజేయతగిన సారవంతమగు చదువు వేరొకటిలభించినది.

6 అనుబంధము.

హిర—తపస్వీ! వింటివా? కుమారునిబుద్ధికుశలత. నాయనా! అట్టి సారవంతమగువిద్యలోని సారాంశముఁ దేటపఱుచుము. విని యానందించెదను.

ప్రహ్లా—తండ్రీ!

ఉ॥ సొమ్ములువాహనంబులని • స్రుక్కక నెవ్వఁడుఁగాని భక్తితో
దొమ్మిదిముక్తిమార్గముల • త్రోవనెఱింగినదామదంబునన్
సమ్మతితోడ శ్రీహరిని • సంస్తుతిఁజేయుట సారవంతమౌ
నిమ్మహిలోన విద్యలకు • నెక్కుడు దానవనాథ! చూడఁగన్

(7 అనుబంధము.)

హిర—ఏమది! హిరణ్యకశ్యపుని పుత్రుఁడే యట్టికులాచారవిరుద్ధంబులఁబల్కుచున్నాఁడా? లేక నేనేవేకలవరింపుచుంటినా? కుమారా! ఏమంటివి!

ప్రహ్లా—జనకా! ఏమియు లేదు.

ఉ॥ ఎవ్వఁడుపంచభూతమయుఁ • డెవ్వఁడునిర్జరసేవ్యమానుఁడౌ
నెవ్వఁడుదివ్యమానుడగు • నెవ్వఁడుభక్తపరాయణుండు నిం

కెవ్వఁడు సత్యమూర్తియగు • నెవ్వఁడు లోకహితుండునట్టి యా
పువ్విలుకాని తండ్రి మదిఁ • బూజలొనర్చుటె ట్టివిద్యయా

హిర — ఇదియా నీవు నేర్చిన విద్య? కుమారా! ఇది మన రాక్షసవంశమునకుఁ దగు విద్య కాదు. హరి మనకా జన్మశత్రువర్గములోని వాఁడు; అట్టి నీచుని మనము స్మరియించరాదు. వానియందేమియు విశేషములు లేవు.

గీ॥ పిపీలికమును లెల్లవానినిఁ • బెద్దఁజేసి
గారవించుచు లోకుల • కనులఁగప్పి
మోసగించుటె గాని యె • ప్పుడును జగతిఁ
దలఁప వానితో సమమైన • తులువ లేఁడు.

కాకున్న మన వంశమున లేని యీ విష్ణుభక్తి యేల? కావలసిన గౌరీమనోహరుని ధ్యానింపుము. ఆతఁడు సర్వవ్యాపి, సర్వాత్మకుఁడు, సర్వహితుఁడు, సర్వలోకశరణ్యుఁడు, గావున బాలకా!

క॥ తెలిసియొ తెలియకనో నుడు
పలుకుల నే లెక్కఁగొనను • బాలక! యికఁ నా
తులువనుఁ దలఁపఁగఁ బోకుము
కలఁపకు నాకోపవహ్ని • గన్నకుమారా!

ప్రహ్లా — తండ్రీ! ఎన్నివిధముల యోచించినను

చ॥ హరిపదపూజకన్న మహి • నత్యధికంబగు సౌఖ్యమెద్ది యే
నరయఁగఁ జిక్కదయ్యె విను • మా; గను మా; కమలాక్షు పూజ చేఁ
దరతరదుఃఖముల్ తొలఁగి • తప్పక శాశ్వత మోక్షమబ్బు నా
హరి నినుతింప నేరికగు • నయ్యె తలంపఁగ దయ్యభూవరా:—

8 అనుబంధము.

హిర — ఓరీ ప్రహ్లాదా! రాను రాను నీ ముద్దులు నాబుద్ధికి విరుద్ధం



బులగుచుండె. నా మాటవిని నీవా హరినామస్మరణ మానుము. మనమా పాపాత్ముని పేరెప్పుడును స్మరించరాదు.

ప్రహ్లా — జనకా! ఒకరికి రుచించిన వస్తువులింకొకరికి రుచింపకుండుట సహజమే గదా? మీకు సరిపడకున్నను మంచుగాక నాకేలయభ్యంతరము? హరినామస్మరణకు మించిన పదార్థమేమి గలదు; ఇట్టు వినుడు.

సీ॥ శ్రీహరిపదసేవఁ • జేయనేరనివాని
జన్మజన్మయె? వృథా • జన్మగాని
కేశవనామ సం • కీర్తనల్ సలుపని
జిహ్వ జిహ్వయె తాటి • కమ్మగాని
పుండరీకాక్షునిఁ • బూజసేయఁగ లేని
చేయి చేయియె పెద్ద • రాయిగాని
పద్మనాభుని కథ • పఠియింపఁ జాలని
మనము మనమె పాడు • వనముగాని
వేయి జెప్పంగ నేటికా • వేదపురుషు
నాటపాటల మతి నాట్య • కూటములనుఁ
దకిటతతకిట తాకిట • తకిటయనుచు
భజనసేయని వారలు • పశువులరయ॥

హిర — కుమారా! హరి దైవంబని గాఁబోలు నీ తలంపు. అట్లు కాదు వినుము.

ఉ॥ పాపుఁడు, దుర్మదాంధకుఁడ • పారవినీతుఁడు చోరవర్తనుం
డాపలు గాకి నిల్లు విన • నర్హముగాని విశుద్ధసంస్తుతుల్
ప్రాపుగఁ జేయుచుండి, నయ • వాక్యములన్ జెవిఁ బెట్టకున్న నా
కోపము పెంపుసేయుటయె • గోలతనంబు నుమా సుపుత్రకా!॥

నా కోపము లోకములను దహింపుచుండుట నీవు మాత్ర

మెఱుంగవా? గనుచుండుటలేదా? గాన నాబుద్ధిని విని నీసుద్దులమానుము.

ప్రహ్లా—తండ్రీ! మీరెన్నిఁజెప్పినను మీమాటలయందు నాబుద్ధి జొరకున్నది. నిక్కంబుగ హరినామస్మరణకంటె సుఖదంబగు వస్తువు వేఱులేదు. మీరే నిదానించి యోచించి, చూడుడు.

చండా—ప్రహ్లాదా! మంచిమాటయె; కష్టపడి నీకువిద్యఁజెప్పినందులకు మంచిఫలమనుభవింపఁజేసితివి. నిండుపేరోలగంబున మాకుఁదలవంపులగునట్లు చేసితివే. చాలు చాలు నీవంటివారు శిష్యులైన గురువులు రెండుచేతులఁ బావుకొనవలసినదే. "గురువునకుఁ బెట్టరాపంగనామము"లను మాటసార్థకముఁ జేయుచున్నావు.

లీలా—గురుపుత్రా! అకారణముగ బాలునిపై నేలఁగోపపడియెదరు. బాలుఁడగుటచే దుష్టులెవ్వరో యాతనికిఁ జేసిన దుర్బోధలీతనిమనసున నాటియుండుటచే నల్పబుద్ధిగల నీకుర్రఁడు యుక్తాయుక్తము లెఱుఁగజాలక యిట్లనుచున్నాఁడు. సంపూర్ణజ్ఞానయుక్తుఁడైన తానే తెలుసుకొనఁగలఁడు.

హిర—దేవి! అవును వాస్తవమే.

క॥ మనమెటు జెప్పిననట్టులె
జనుచుందురు కుఱ్ఱవాండ్రు ♦ సాహసలీలన్
గనఁజాలరు సౌఖ్యము, పసి
తనమగుటను బాగుయోగు ♦ దానినితస్వీ!॥

గాన గురువర్యా! మీరీబాలునిఁగొనిచని, తగినధర్మంబులుపదేశించి బుద్ధిమంతునిగాఁజేయుఁడు.

చండా—దనుజాధీశ్వరా! మీయాజ్ఞనుల్లంఘింతునా?

(నిష్క్రమించుచున్నారు.)

——(o)——

# భక్తవిజయము

## చతుర్థాంకము.

(ప్రవేశము చండామార్కులు.)

చండా—అబ్బా! ఈప్రహ్లాదునికి బుద్ధిచెప్పుటకుఁ దలప్రాణము తోకకువచ్చుచుండెఁగదా! పసితనమున నేయుండాకొడుకులా హరినామస్మరణ బోధించిరో, నాకంఠమునకుఁదెచ్చిపెట్టిరి. నేనెన్నిరీతుల నయభయంబుల బోధించినను "తాబట్టినకుందేటికి మూఁడేకాళ్లను"నట్లు నేఁజెప్పెడిదంతయు బూదిని జేసిన నాహుతివలెఁ జేయుచు హరిభక్తిమాత్రము విడువడయ్యె; గాని నాపూర్వకృతమెట్టిదో నిన్న నేఁడు నేజెప్పినదానికెల్ల నూఁకొట్టుచు యర్ధాంగీకార సూచకముగఁ దలయూపదొడఁగె. మాఅమ్మకడుపు చల్లనిదగుటచేతనే యిప్పటికీబాలునికి మతికుదిరినది. నాఁడే నాప్రాణములు పోయియుండుఁగాని, పాపము విప్రజాతిమూలకముగ నేటివఱకు నాబిడ్డల చలువన బ్రతికియుంటిని. ఈహిరణ్యకశ్యపమహారాజుతోఁ జెలిమి, పాములతోఁ జేయుసయ్యాటలవంటివి. ఎట్లున్ననాకేమి. నానెత్తిపైనున్న భారము తీరినఁజాలును. ఇప్పటికీబాలునిఁగొనిచని వారికొప్పగించెద. నాగ్రహచారము బాగుండెనా యిప్పటిబుద్ధియే స్థిరముగనుండును. లేదా నాపాట్లకుమే

రయేలేమి. ఱోటిలోతలదూర్చి ఱోకటిపోటునకు వెఱచి నదప్పునా?

(నిష్క్రమించును)

(ఇదివిష్కంభము.)



ప్రథమరంగము.



లీలావతి అంతఃపురము.

(ప్రవేశము:— లీలావతి, ప్రహ్లాదుఁడు.)

లీలా— తండ్రీ! నీకిదియేటిభ్రాంతి? నీకీదుర్బుద్ధియేల? నాయనా మీాజనకుని యాగ్రహమునకేల పాత్రుఁడవయ్యెదవు?

ప్రహ్లా—తల్లీ! నీవునునాయనగారితో పాటేమైతివిగా.

(9. అను బంధము.)

అమ్మా! జనకునికోపమునకైనను, తన్మూలమున నాకుసంభవించుకష్టములకైనను లెక్కసేయనుగాని హరినామస్మరణ మాత్రము విడువఁజాలను.

క॥ పరమానందమయంబును
స్థిరమగుకైవల్యపదవి ♦ సిద్ధించెడునా



హరికీర్తనంబుమానుట
తరమగునేమేరికైన? ♦ తల్లీ! వినుమా ॥

మీాఱందఱకేకరీతిగఁ బట్టుపట్టి, నన్నేలనిర్బంధించెదరు. శ్రీహరిధ్యానసౌఖ్యమే మెఱుంగుదురు.

చ॥ చెలువగుమందిరంబుల వ ♦ సించుటకంటెను మేలువస్తువుల్
పలుమచులుప్పతిల్లఁగను ♦ భక్షణసేయుటకంటె హాయిగా
తెలిమృదుశయ్యలందెపుడు ♦ దివ్యసుషుప్తినిఁ జెందుకంటెస
త్ఫలమునొసంగుఁగాదె హరి ♦ పాదసపర్యసతంబుఁ దల్లిరో ॥

తల్లీ! ఇంకొక్కటివినుము.

(10. అనుబంధము.)

అట్టిపరంధాముని నారాధించఁగూడదని చెప్పమీాకెట్లు బుద్ధిపుట్టె? స్వకులాభిమానపరుండగు తండ్రిగారు చెప్పినఁజెప్పుదురు గాక. మీాకుఁదగునా? అజ్ఞానాంబుధిఁబడి పోవు వానికి బుద్ధిచెప్పుటకు మారుగ

క॥ భవసాగరముఁ దాటఁగ
నవలీలఁ బ్రాప్తమైన ♦ హరిపదపద్మ
దవులవిడనాడమనియీా
యవినీతులు జెప్పఁగునె ♦ యమ్మరో! నాకుఁ ॥

నాయెడమీాకంగటికి నెక్కటేబుద్ధిగలిగినందులకు నాకాశ్చర్యమగుచున్నది. తల్లీ! నాప్రార్థననాలకించి నాదారిననన్నుఁ బోవనిమ్ము. మీాకయిష్టమయిన మీారురాకుడు. నన్నేలని ర్బంధపెట్టెదరు? పిలుకలకొలకిల్లుఁ జిచ్చుఁబెట్టఁ జూచెదరే?

అమ్మా!

చ॥ తలఁపఁగ విష్ణుకంటెపర ♦ దైవము లేఁడిల నేల వెఱ్ఱులై
కలఁచెదరమ్మ నామదిని ♦ ఖండితరీతినిఁ జెప్పవాఁడనో
జలజసుగంధి! నేవిడువఁ ♦ జాలను శ్రీహరిభక్తి నమ్ముడీ
దలఁతురె వెల్గువీడి సత ♦ తంబును చీకటిలో వసింపఁగన్ ॥

లీలా—తండ్రీ! నేఁగాదనుగాని నీతండ్రిగారిమనసు నొప్పింపకుము.

(11. అనుబంధము.)

ప్రహ్లా—తల్లీ! ఏమిచిత్రమిది! మిమ్మెవరు ఖేదపెట్టుచుండిరమ్మా?

లీలా—నీవే

ప్రహ్లా—ఎట్లు?

లీలా— స్వకులాచారధర్మంబులన్ వీడి పరమతాభిలాషివై, తండ్రిగారిమాటలనుల్లంఘించుటచేత.

ప్రహ్లా— తల్లీ! ఇదియా మీరూహించినసారాంశము. సరే, బాగున్నది. మీరుచెప్పెడి కులాచారధర్మములెవ్వి?

చ॥ సురలను బాధపెట్టుటయు ప్రసుక్కఁగఁ జేయుటయున్ మునీంద్రులన్
దరుణులబల్మిఁ బట్టుటయు ♦ దగ్ధమొనర్చుట యజ్ఞవాటికల్
బరగఁగ నివ్వియే గద ప్ర ♦ భావము లీమనదానవాళికిన్
యెఱిఁగి యెఱింగి యిట్టిపను ♦ లేగద నన్నును జేయఁగోరుటల్ ॥

ఎంతపిచ్చిదానవమ్మా? జన్మమెత్తినందులకు యుక్తాయుక్తవిచారణలేక కరుణబాసి యిట్టిఘోరకార్యములేనా నన్నుఁ జేయమనుట?

లీలా—నిన్నట్టికార్యములఁ జేయమనుచుంటినా? మీతండ్రియిష్టా



నుసారముగఁ గులదైవమును నారాధింపుము.

(12. అనుబంధము.)

ప్రహ్లా—తల్లీ! నీమాటలయందేమిభావమున్నదమ్మా? మీరనుమాధులు పోవలసినదారినిఁ బోవుటన్యాయమా?

క॥ కులదైవమంచు నొక్కనిఁ
తలఁడే భావించిచూడఁ ♦ గానవి నీతుల్
దలఁచెడిగతిని మీనను
దలపోయఁగ నేల నమ్మ? తల్లీ! చెపుమా

(13. అనుబంధము.)

లీలా—కుష్మురా? నీమూర్ఖతకేమందునురా? ఒక్కొక్కగ్రహమునకొక్కొక్కయధినాథుఁడుండు నట్లొక్కొక్కమతమునకొక్కొక్క దైవముండును. దానవవంశమునకంతకును భుజగభూషణుఁడే పూజ్యతముండు. నీవాదేవదేవునుద్దేశించి కీర్తివంతుఁడవుగమ్ము.

ప్రహ్లా—తల్లీ! శివకేశవులకెంత దైవభేదమున్నదమ్మా? సాక్షాత్తుగా నాపరంధాముఁడే రూపభేదములచే నెవరియిష్టానుసారముగ వారలకగుపడుచుండు నేగాని యెంచిచూడ సర్వదమ్ము నొక్కటే సుమీ. అజ్ఞానులాలోచనారహితులై కులాచారంబులంచు దురభిమానులై సత్యదయాపరత్వములేక సాధులనుబాధింప జూచుచుందురు. ప్రాజ్ఞులట్లుగాక యెల్లమతములు నెల్లధర్మ

ములు నొక్కటియేయని భావించి సకలచరాచరంబుల కంత
కునాహరియేయధినాథుండను సత్యమెఱింగి తమ్ము ద్వేషించు
వారినిఁ గూడ ప్రేమించుచు పరోపకారమే పరమవ్రతముగఁ
గైకొనిసదా మెలంగుచుందురు. అమ్మా తెలిసినదా?

లీలా — తండ్రీ! అట్లైన నీకీపంతమేల? ప్రాజ్ఞులరీతి సకలచరాచరం
బుల కాశంకరుఁడేయధినాథుండని నమ్మియేల భజింపరాదు?

ప్రహ్లా — తల్లీ! నాకట్టి భేదములేదుగాని యొక్కటిఁ జెప్పెద నాలింపు
ము. ఊరికెన్నియో త్రోవలుండినట్లు సద్గతినిఁ బొందుమా
ర్గములెన్నియో గలవు. వాటిలో మీరనునదిగూడ నొకదా
రియేగాని నాకు మాత్రము గాదు. ఏమంటివేని.

చ॥ "దొరకెనుసప్రయత్నముగ ♦ దుర్లభమౌ హరిభక్తి" యంచునా
బరఁగెడిమార్గమొక్కటి వి ♦ వాదములేల? వికల్పబుద్ధితో
దొరకిఁపదానివీడి, పెడ ♦ త్రోవనుఁ బోవఁదలంచఁగూడునే
తిరుగుడురాతికెందయినఁ ♦ దీరిక చిక్కునె? పంకమంటునే?

(14. అనుబంధము.)

లీలా — కుమారా! మంచిమాటయే. ఈవైరాగ్యమెక్కడ నేర్చు
కొంటివి.

గీ॥ గర్భశత్రుండు శ్రీహరి ♦ గానవాని
స్మరణఁ జేయుటతగదంచు ♦ నెఱుఁగ జెప్పు
తండ్రియాజ్ఞలకెదురాడ ♦ తగునె? కన్న
తండ్రియేగద పుడమిని ♦ దైవమరయ ॥

(15. అనుబంధము.)



ప్రహ్లా — అమ్మా! ఇదెచ్చటనైనగలదా? భగవంతునకు శత్రులనియు
మిత్రులనియుఁ గలరే. ఔనౌను నీవన్నదియు నిస్తనమే.
ఎట్లంటివేని.

క॥ లోకద్రోహులు నల్పులు
ప్రాకటముగ ధర్మ ♦ కార్యపరివర్తనులా
పాకారిద్వేషు శౌరికి
నేకరణిని శత్రులౌదు ♦ రెంచుము తల్లీ ॥

లీలా — పుత్రకా! ఎంతజెప్పినవినవేమి సేయుదు? నిన్ను బ్రతిమాలెదఁ
దండ్రీ! నా మాటవినుము. పెడబుద్ధులుమానుము.

చ॥ వినుము కుమార! యవి ♦ వేకముఁ జెందకురా సుధీర! మా
కనుపున మంటఁ బెట్టకుర; ♦ కానిపనుల్ దలపెట్టనేల?

ప్రహ్లా — మీ
కనుపునవ్యర్థుఁడొక్కఁడు ♦ గల్గెనటంచును సంతసించి ప్రే
ముడినిఁ దలంపఁబోకుమిఁక ♦ మోదముగల్గును మీకునన్నిటన్

లీలా — తండ్రీ! ఇదియేమమ్మాటికిఁబంతమా? అయ్యో! ఇదెక్క
డియోచనయో నీకీ మహోద్బోధనలెవరుజేసిరిరా? తగదనిజె
ప్ప తగవులాడెదవుగానియల్లారిముద్దుగ "సరేనమ్మా" యని
యనవు. అదేమిగ్రహచారమో నిన్నుఁ జూచినది మొదలునా
కు దుఃఖము పొంగిపొరలివచ్చుచున్నది. మీతండ్రి మాటల
తో నూరుకొనువాఁడు గాదు.

(16. అనుబంధము.)

లీలా! — అయ్యో! పుత్రా! నిన్నుఁగడుపారఁగన "నీవేమోయమ్మ
ద్ధరించెద" ఎని నమ్మియుంటిమిగాని, యిట్లగుదువని దలంచ
మైతిమిగా. నాయనా! నా ప్రార్థననాలించి నీవాపాడుహరి

నామస్మరణ మాని మనుష్యుద్ధరింపుము. లేని వ్యథఁగల్పింప
కుము.

ప్రహ్లా—తల్లీ! నావిషయమై మీరేలఁజింతిల్లవలె?

లీలా—సీమంతులనంబునకును, మీతండ్రిగారిపట్టుదలకును; చూచి
చూచి నిన్నెట్టియిక్కట్టుల పాలుజేయునోయని దిగులగు
చున్నది.

ప్రహ్లా—తల్లీ! ఇందునకామీకుదుఃఖము? కెట్టితల్లీ! తండ్రియేధర్మపద
మఁదప్పి తనయిష్టానుకూలముగఁ బ్రవర్తింపనందులకు నన్ను
దండించఁదలపెట్టడు. ఒకనేళనట్లుజేసినను భయములేదు.
అన్నిటికా శ్రీకాంతుఁడేగలడు. అమ్మా! త్రికరణశుద్ధిగఁజె
ప్పు నాకడసారి వాక్యములాలించుము.

గీ॥ ధర్మమునువీడి క్రూరతఁ ♦ దండ్రియెట్టి
శ్రమలఁబెట్టిన నవియెల్ల ♦ సంతసమున
ననుభవించెదఁగాని యే ♦ క్షణమునైన
విష్ణుభక్తినిమాత్రము ♦ విడువఁజాల॥

(ప్రవేశము:— హిరణ్యకశ్యపుఁడు, చండామార్కులు)

తండ్రీ! నమస్కారములు. గురువర్యా! వందనములు.

చండా—ప్రహ్లాదా!

గీ॥ నీవునేర్చినవిద్యల ♦ భావమెఱుఁగఁ
గోరుచున్నట్టినీతండ్రి ♦ కోర్కెదీర
సర్వజనహృద్యమమ్మగు ♦ సంగతినిదె
చదువుమావేగవారలు ♦ సంతసింప ॥

హిర—తండ్రీ! ఏదీ యొకపద్యమునుజదువుము. వెనుకటికన్ననీబు
ద్ధికుశలత లిప్పుడెట్లుండెనో కనుగొనియెద.



ప్రహ్లా—ఉ॥ సొమ్ములు వాహనంబు &c- (పూర్వోక్తపద్యముఁ
జదువును; ఆ తొమ్మిదిమార్గములేవియన

క॥ తనుహృద్భాషల చెల్మి శ్ర
వణమును దాసత్వమరయ ♦ వందనములున
ర్చనసేవ లెఱుక సంకీ
ర్తన చింతనలగు సుగతి ♦ కి నవమార్గములున్ ॥

మఱియు సర్వాత్మకుండై, సర్వంబుదానై, యదియదియని
నిర్దేశింపనలవిగానినాపరబ్రహ్మముదానైన శ్రీహరియందు
న చిత్తంబునైక్యపఱచి పరమానందమునొందుటకన్న నిహ
పరసౌఖ్యంబులు గలవే. అట్లుసేయక సజ్జులుకొందఱు

ఉ॥ ఇల్లును వాకిలంచు భువి ♦ నెప్పుడు తద్విషయానుసక్తులై
వెల్లుగమీరు మేమనెడి ♦ వెఱ్ఱిని జిక్కినిమేషమైనదా
ముల్లమునందు నాహరిని ♦ యోచనసేయరునిశ్చయంబుగా
కల్లగదాసమస్తమును ♦ గావున శ్రీహరిఁజేరఁ మేలగున్ ॥

హిర—(స్వగ) తొండముదిరి యూసరవెల్లియైనది. ఇఁకఁజెప్పవలసి
నదేమున్నది. సామదానభేదదండోపాయంబులనీబాలునిఁజ
క్కబఱచుకున్నఁ గులమునకంతకుఁ జేటురాకమానదు.
బ్రహ్మాకైవంగనిదిబ్రహ్మానైవంగునా? (ప్ర) ఓరీ ప్రహ్లాదా!

క॥ హరినేటికిఁదలఁచెదవిటు
దురితాత్ముఁడు దుర్మతియును ♦ దుష్టుఁడు మనలన్
జెఱుపఁగ నుండిన వానిని
స్మరియించుటతగదు కుఱ్ఱ ♦ సంకరమతివై ॥

కులాచారవిరుద్ధమగు నీకీదురోభ్ధన లెట్లుకట్టువడెనోతెలి
యకున్నది. కుఱ్ఱా! కుఱ్ఱవాడవు గనుక నీకు మంచిచెడ్డలు

తెలియవు. నీవుదలంచువిశేషము లేమియు వానియందు లేవు వా
నిచరిత్రములన్నియు హాస్యాస్పదములును, నిందార్హములును.

ఉ॥ ఆతఁడె మష్టవర్తనుఁడు ♦ నాతఁడె క్రూరుఁడు నీతిభ్రష్టుఁడిం
కాతఁడె మత్స్యకూర్మములు ♦ నాతఁడె పందియుఁ గుక్కయట్టియా
పాతకునిన్ స్మరించినను ♦ భాగ్యమ? భోగ్యమ? నట్టివాని ప్ర
ఖ్యాతిగఁ జెప్పవచ్చెదవు ♦ గాతనయా తగునా? తలంపఁగన్ ॥

ప్రహ్లా—తండ్రీ! మీరెంచినదంతయు దుష్టులమట్టుబెట్ట సందర్భాను సారంబుగఁ దాల్చిన యవతారంబులు గాని వేఱు గాదు. ఆ మహానుభావుని మహిమ లెన్నియో గలవు. ఎట్టివారి కట్టి రూపునఁ గనంబడుట వాని స్వభావము. అంతియగాక.

ఉ॥ స్వర్గముకన్న నెక్కుడగు ♦ సౌఖ్యము గల్గును విష్ణుపూజచే
నిర్గుణ నిర్వికల్పకుఁడు ♦ నిశ్చలతత్వుఁడు వాసి వైఖరుల్
దుర్గమముల్ కనుంగొనఁగ ♦ దూహలు లౌముకు లంతవారికే;
దుర్గుణులెట్లుగాంచెదరు ♦ దుర్లభమా హరిమాయలక్కటా!

తండ్రీ! వేయేల? చక్రిచింతనలేని జన్మ మొక జన్మముగా దని యే నాయభిప్రాయము.

హిర—(స్వ) నిజముగ నీబాలునికీ దుర్నీతి యెవ్వరో బోధించియుం దురు. ఎవ్వరోయన నేల? ఈపాపాత్ముఁడే (ప) ఓరీ! గురు రూపవంశదావానలా!

ఉ॥ "బాగుగ సర్వవిద్యలనుఁ ♦ బండితుఁ జేసెదనంచుఁ జెప్పి యీ
లాగున వైరిశాస్త్రములె ♦ లాంచనగా నొనరించినావ? ని
యోగడబుద్ధియెల్లఁ దెలి ♦ యంగనువచ్చెను చిన్నికుఱ్ఱవా
నీగతిఁ జేయఁగా మనసు ♦ నెట్టులనొప్పెర బ్రాహ్మణాధమా!

చండా—(వణకుచు) అయ్యో ఖర్మమా నాకేమునిగినదా? (ప్రకా)



దానవకులకంఠీరవా! హిరణ్యకశ్యపమహారాజా!

క॥ నీయుప్పు నీకారము
నీయన్నముఁ దినుచు నుండి ♦ నినుఁ గాదని యీ
హేయపు కార్యము లక్కట
చేయుదుమే యాశ గల్గి ♦ జీవములందున్ ॥

నేను వేఱుగఁ జెప్పవలయునా? మీరలెఱుఁగరా? మీక్షేమ మునుఁ గోరెడు గురుపుత్రులము గామా? మీరెంచినట్లు జేయువా రమే? అదిగాక మీశౌర్యగాంభీర్యాదిగుణముల నెఱిఁగిన మే మే యిట్లు జేయ సాహసించెదమా? మా ప్రాణంబులపై మా కుఁదీపి లేదా? నేటికి సుఖముగ మీయనుగ్రహమున జీవించు చున్నాము. కుడిచి కూర్చుండ లేక యాపదలనుభవించ నెట్టి వె ఱ్ఱులైనను సాహసించెదరా? గావున

క॥ కోపము జెందకు నాపయి
భూపాలక! యిట్టినీచ ♦ బుద్ధులు సెప్పన్
బ్రాపగుదుమె? మీ రెఱుఁగరె?
నీపాదములాన యాన ♦ నీచరతిలకా! ॥

మాయెడ నేతప్పిదము లేదు; ఈబాలునకీబుద్ధి యెట్లుగలిగెనో తెలియదు. గాన నన్ను రక్షింపుము.

హిర—కుమారా! వినుచుంటివిగదా?

క॥ ఆచార్యులు చెప్పక నీ
వీచదువెటు నేర్చినాఁడ ♦ వెఱిఁగింపుము సం
కోచపడక నాదాపున
దాచఁదగునె యిట్టిమర్మ ♦ తతులెన్నటికిన్ ॥

ప్రహ్లా—తండ్రీ! మీరెంత వెఱ్ఱివారలు! దేదీప్యమానమై, సామాన్యజ

నసుర్లభంబై, సకలలోక, సౌభాగ్యప్రదమై చిరకాలసుఖాస్పదంబై విలసిల్లు నీవిష్ణుభక్తి యొకఁడు చెప్పినంతనే పట్టుపడునా? అట్లుచెప్పుటకు దానిమహిమ లెఱిఁగినవారలెవరిందుఁ గలరు. ఆలోకారాధ్యుని నిర్హేతుకజాయమాన కటాక్షమువలననే గాని లభింపదు. తండ్రీ!

ఉ॥ చీకటిలో మునింగి ధర • జీవులు వెల్గునుఁ గాంచలేక తా
రేకవిధంబులన్ శ్రమలు • నెక్కుడుఁ బొందుచునున్నవారలా
శ్రీకమలాక్షు పాదసర • సీరుహముల్ పడిఁ జేరు మార్గముల్
నాకెటు జెప్పనేర్తు రఘు • సంబని యెంచఁగ దానవేశ్వరా॥

ఎవరెంత తల్లకిందుగ తపమాచరించినను, ఆమహాత్మునికృపాకటాక్షము లేనిది లభింపదు. ఔరా! నాపుణ్యమే మనవచ్చు; పూర్వజన్మమున నెట్టి సుకృతము లొనరించితినో గాని

క॥ ఇలపై నెవ్వరికైనను
గలుగని శ్రీవిష్ణుభక్తి • కలిగెను తండ్రీ!
తొలిజన్మమందుఁ జేసిన
ఫలమున; నేనెట్లు దాని • వదలఁగనేర్తున్॥

నేను చిన్నవాఁడనని నామాటల నిర్లక్ష్యభావమునఁ ద్రోసివేయక తాపత్రయములఁ జిక్కక "పుట్టుటగిట్టుటకొఱకేగదా" యనినమ్మియుండి జీవించియుండు నీనాలుగురోజులైనను నా హరిపదధ్యానమును మనసున నిల్పి ముక్తినిఁ గాంచ బ్రయత్నింపుడు. లోకంబున జనులు వెఱ్ఱులై

గీ॥ ఇల్లునాదియంచు • యిల్లాలు గలదంచు
నవని భ్రమల పడుదు • రంతెగాని



వెళ్లిపోవునపుడు • వెంటరాదేదియు
దైవభక్తియొకటి • తప్ప; తండ్రీ!

హిర—ఆఁ! ఏమిరా! నీధర్మోపన్యాసములు!

ఉ॥ ఓకుటిలాత్మ! నీవిటుల • నోడక శ్రీహరి యంచునుంటివా
ప్రాకటమైన దుర్యశము • పాలయిపోదువు; రాక్షసాళికిన్
శ్రీకమలాక్షు పూజలనుఁ • జేయుట కూడదు; నీతిదక్కి నీ
వాకలుషాత్మునిన్ దలఁప • కయ్య; విరుద్ధపు దారిఁ బోకుమా

నామాటలాలకించి బుద్ధిఁగని హరిగిరియంచు స్మరింపకుము. ఆతఁడు మనశత్రువర్గములోనివాఁడగుటచే నతని ప్రతిఘటించి పోరాడుటయే మనకులంబువారికి యశంబుగావున

క॥ కననియ్యకు వంశంబును
ననవినరానట్టిమేటి • యపకీర్తిని నో
తనయ! దలంపుము యీ
జనదూష్యపుఁబనులు మాను • సద్గుణశీలా॥

ప్రహ్లా—తండ్రీ! హరిపదధ్యానముచే వంశమునకపకీర్తి గలుగునా? ఇదియెందైన సరియగుమాటయా? జిహ్వకురుచియగు పదార్థమును భుజించినవానిని జనులు దూషింతురా? లోకానుభవము లేని మూఢమానసులు దలంచిన దలంతురుగాక; అందలి నిజానిజములరయఁ గల్గిన మీరే యిట్లు దలంచిన లోకము సాగనేర్చునా? మీకట్టిబుద్ధి గలుగుటయు నాపూర్వజన్మసంచితమేమో మీ? ఇక మీ యిష్టము వచ్చినట్లు మీరొనరింపుడు. నేను మాత్రము మీతో నేకీభవించను. ఏమంటిరేని.

చ॥ హరిపదపూజనంబును జ • యాన్వితవిద్య పదార్థవృత్తియే
దొరకఁగ వానివీడి పెడ • త్రోవలఁ బోవు నరేభువిన్ నిశా

చరవర! వింటె మీరనిన ♦ చప్పిడిమాటల కర్థమేమి నే
స్థిరమతిఁ జెప్పువాఁడ ఘను ♦ శ్రీహరి సేవలు మానఁజాలనే

(17 అనుబంధము.)

హిర—ఛీ! దుష్టా ఏమిరా నీమొండితనము

ఉ॥ కన్నకుమారుఁ డంచు నిను ♦ గట్టిగ దండనఁ జేయలేక నే
మన్ననఁ జూపుచుండ కొర ♦ మాలినమాటల నొవ్వఁ జేసెదే?
తిన్నను నింటి వాసములఁ ♦ దీసెడు కూళలరీతి యయ్యె నో
చెన్నటి! నిన్ను నే విడువ ♦ జీవము తోడుత; కాచుకోతగుః

కన్ని సుద్దులఁ జెప్ప నేర్చినవాఁడవు నామాటలు విననీకేల బుద్ధిలేదు? బాగుగ యోచించుకొనుము. పిదప పశ్చాత్తాపపడి లాభముండదు.

ప్రహ్లా—తండ్రీ! మీ రేమి చేయనున్నను చేతునుగాని హరిభజనమాత్రము విడువఁజాలను. దానిలోని సారాంశమును మీ రెఱుఁగకుండుటచే సట్లు వివావేశమే ప్రధానముగాఁగొని పల్కుచుంటిరిగాని దానిని నొకసారి గ్రోలిన స్వప్నమునందుఁగూడ విడుచుటకు నిచ్ఛగింపరనియే నాదృఢనిశ్చయము. మీకుఁ దెలియకున్న నేఁ దెల్పెద నాలకింపుడు

చ॥ చెలువగు మందిరంబుల &c. (అనుపూర్వోక్త పద్యము)

హిర—ఏమిరా! నీ వమిక్కిలి నా కేబుద్ధులఁ గఱపు చుంటివిగా?

మ॥ పలుగాకీ! యికఁ జాలురా; చలము నా ♦ పైనాకు శత్రుండె నీ
వలపుల్ దైవమటంచు నొక్కి మొగినిన్ ♦ వాక్రుచ్చి మోమాటమా
టలనన్నిట్టుల నొంపఁ జూచుటకు వంటన్ ♦ బట్టినా కొర్విప్వ ఛీ
తులువా! వాగకుమింక నా యెదుటనీ ♦ సర్వాభవల్ బొమ్మికన్



నిన్నింకమాటలతో విడచిన ప్రయోజనముండదు. హరినామస్మరణ మానవైతివేని దుష్టాంగంబును ఖండించి శేషించిన యంగములకుఁ గూడ నద్దోషమూ పాదించకుండఁ జేయు చికిత్సకుని చందంబున నిన్నిప్పుడే మట్టుపెట్టి యీదానవవంశంబు పవిత్రతనొందింపకున్న కీడుమూడుట నిజంబు. మఱియు నో బాలకా!

మ॥ "బలవద్వైరిని సంస్తుతించమనకున్ ♦ భావ్యంబుగాదం"చు నే
పలుమారుల్ వినుపించు నీతుల నుసం ♦ భావింపకొక్కుమ్మడిన్
వెలలేనట్టి ప్రతాప వాక్యములసం ♦ ప్రీతిన్ ప్రశంసించనీ
యిలలో నీవొక బుద్ధిశాలివనుచున్ ♦ యెంచన్ సుమీ బాలకా

నీగర్వము నే నణఁచక పోలేనుగాని,

మత్తకోకిల.

పిల్లవాఁడవటంచు నెంచుచుఁ ♦ ప్రేమ జూపుచునుండుటన్
ప్రల్లదంబునఁ గన్నుగానక ♦ వాగుచుంటివి కల్లరీ!
చెల్లునే తగదంచు బుద్ధులఁ ♦ జెప్పినన్ వినకుండుటల్
ద్రుళ్లడంచకఁ ద్రోసివుత్తునె ♦ దుష్టచిత్త! కులాంతకా!

ఓరీ ప్రహ్లాదా! బాలుఁడవని యెంత శాంతతతో నున్నను మొండితనమును విడువకున్నావుగా? నీ వా హరిభక్తిని వదలకున్న నీప్రాణము లింక దక్కఁబోవు. అప్పుడు హరిగిరి నీకడ్డు రాఁబోఁడు. నామాట వినుము

ప్రహ్లా—తండ్రీ! ఈ తుచ్ఛశరీరంబులపై నాశచే మీరు బెదరించినంత నే వెఱచి హరినామస్మరణ విడుతుననుకొంటిరా! మీచే నేర్పఱుపఁబడి, మీచే వృద్ధిఁగాంచఁబడిన యీదేహము మీ యదియేగాన మీరు కావలయునన్న నిదే యొసఁగెద నై

కొనుడు. నాప్రాణంబులపై నాశకలదని భావించితి రేమో? అట్లెన్నటికిని దలంపకుడు. తండ్రీ! ఆహా! మహిమ లెంతని వర్ణింతును.

శా॥ బ్రహ్మేంద్రాదులకన్న మిన్నయగు నా • బ్రహ్మంబు నా విష్ణువే
బ్రహ్మానందమొసంగు మార్గమిలలో • భావింప నా విష్ణువే
బ్రహ్మాండంబులకెల్ల నేతయగుచున్ • బాలింప నా విష్ణువే
బ్రహ్మజ్ఞానులకల్పవృక్షమయి కా • పాడంగ నా విష్ణువే.
అంతియగాక

ఉ॥ చీకటిఁ బాపుచున్ వెలుగుఁ • జేర్చుచు భక్తులపుణ్య పాపముల్
చేకొని ధర్మమార్గమున • జీవులఁ బోలఁగఁ జేయుచుండు నన
స్తోకమనీషు సర్వజన • తోషుఁ బాపవిదూరు సత్ప్రభున్
శ్రీకమలాక్షునిన్ భజన • సేయుట మానఁగఁ జాలతండ్రి! నే.
ఏల వృథా యూసము జెందెదరు?

హిర—అక్కటా! వీడెంత మూర్ఖతవహించినను, కన్నకడుపగుటచే హింసింప మనసొప్పకున్నది. జాలిఁ దలఁచి యూరకున్న కొలఁది వానిప్రేలు డధికమగుచుండె. నాకీజాలితగదు. తల్లి దండ్రుల యాజ్ఞమీఱి వర్తించు కులనాశనుఁడు శత్రుడు గాక పుత్రుఁడెట్లగును? (ప్ర) ఓరీ ప్రహ్లాదా?

ఉ॥ మూయవదే నోరు; కుల • ముక్ జెఱుపంగ జనించినావురా
పాయవదేర విష్ణుపయి • భక్తి నిమూఢుఁడ! యెంత జెప్పినన్
కాయముపైని నాశలనుఁ గాంచవదేఖురా! యెంత మొండివై
మాయము జేతునిన్ను నను మానము లేదురయింక సైపరా.

ప్రహ్లా—తండ్రీ! మీ యిష్టము వచ్చినట్లు కానిండు సిద్ధుడనైయున్నాను. జీవితంబులపై యాశగలవారి యెడ మీ నయభయంబు



లు పనికివచ్చునుగాని నాయెడ నిష్ఫలములు. తడవుసేయనేల? ఇదేయీ పాపపు శరీరమునుఁ గొనుడు.

(18 అనుబంధము.)

హిర—ఏమిరా!

పంచచామరము.

ఆరే! మదాంధ! పాపి! నీచ! • యాగడంబు చాలురా
నిరాదృతుర్ బొనర్తువే మ • నీషులెల్లఁ జూడఁగా
గరాసినీ శిరంబు రెండు • గాఁగ జేతు నిప్పుడే
దురాత్మ! సైపజాలమాట • తోఁ ఫలంబు లేదురా.
(భార్యతో) సఖి! ఇంక నాయత్నము లేదు.

లీలా—నాథా! నామనవి యాలింపుడు. కుఱ్ఱ డుగదా? కొంతకాలమునకు వానికే బుద్ధివచ్చును. ఆగ్రహంబు నొందకుఁడు. కరుణించి పుత్రుని విడిచి పుచ్చుడు.

[19 అనుబంధము.]

హిర—దేవీ! నీవు మతేమి జెప్పినను వినెదనుగాని యిందుమాత్రము నాకెదురాడకుము. వీఁడు మనకు నిజముగా పుత్రుఁడా

గీ॥ తండ్రియాజ్ఞలఁ జెల్లింపఁ • దలపనట్టి
పుత్రుఁడైనను శత్రుఁడే • పోలతియున్న
నాథునాజ్ఞల వినసట్టి • నాతిమగని
పాలిమాఱియె గాకున్న • భార్యయగునె.

ఓరీ! ఎవఁడురా అక్కడ? మీకీబాలునిఁ గొనిపోయి నాపుత్రుడని శంకింపక.

కం॥ పట్టుము కొట్టుము నెట్టుము
మొట్టుడు నెనేలేనికష్టముల్ • విడిపోసఁగన్

బెట్టుచు రాలనుఁ గల్పై
బిట్టడలించుడిఁకఁ బొండు ♦ పిచ్చివదల్పన్

కింక — చిత్తము. (అనిలాగుచుఁ దీసుకొనిపోవుచుండగా)

హిర — ఎక్కడికో వలదు. నాయెదుట చేయుపని గావింపుడు

ప్రహ్లా — హా దీనబంధో! ఆర్తరక్షకా! ఆపద్బాంధవా! శ్రీహరీ!

శా॥ ధీరాగ్రేసర! భక్తపాలన! హరీ! ♦ దేవాధిదేవోత్తమా
ఘోరాఘౌఘహరా! ముకుంద! వరదా! గోవిందపద్మాక్ష! సం
సారాంభోనిధికర్ణధార! కమలా ♦ ధీశా! శౌరి! దామోదరా!
శ్రీరామాచ్యుత! వాసుదేవ! నినునే ♦ సేవింతుచింతామణీ.

(20 అను బంధము)

హిర — ఏమి యాశ్చర్యము! కింకరులు గావించు ఘోరదండనకించుకయైన వెరువడు వెనుఁదీయడు. కిరాతులే దుర్బలులైరి మాయగానున్నది. [(ప) ప్రహ్లాదా ఇంతటనయినా బుద్ధివచ్చెనా?

ప్రహ్లా — తండ్రీ! లేనిబుద్ధి వచ్చునా? ఉన్నదిపోవునా? గానిమీచద్ధిములచే నాకుండిన చీకఁటియుఁ బోయి చేవగలుగుచున్నది. ఏలవృథాయాసమును జెందెదరు? మీరుపెట్టుబాధలు నాకు ఖేదమును గలిగించక మోదమునే గలిగించుచున్నవి నుమీ?

హిర — ఔరా! చీకువదలి చేవగలుగుచున్నదిగా? ఏమీ నీదిట్టతనము నీచేవయేమియో జూచెద! సేవకులారా,

కం॥ మత్తగజంబులచేతను
మొత్తించుచు జాలిదలఁపఁ ♦ బోకుడు వీనిన్
నెత్తిన బండలఁ బెట్టుచు
హత్తించుచు తెల్లు దేహ ♦ మంతట వడిగా.

సేవ — చిత్తము. [అని అట్లు జేయుచున్నారు.)



ప్రహ్లా — శా॥ పారావార విహార సద్గుణకళా! ♦ పాదోధిశయ్యాసనా
కారుణ్యామృతసాగరా! దివిజశో ♦ కాంభోధిపారా! సదా
ధారా! దుష్టభుజంగగారుడమణీ! ♦ దందహ్యమానాఘ! ఓ
శ్రీరామాచ్యుత! వాసుదేవ! నినునే ♦ సేవింతుచింతామణీ

(20 - 2 అనుబంధము.)

తండ్రీ! వందనములివే గైకొనుడు

హిర — ఛీ! పిరికిపందలారా! ఇంద్రజాలకుని భంగి వాకనులఁ గప్పి బాలకుని యందు జాలిఁదలచుచుంటిరా? మీపనిఁ దరువాత చూచెదఁగాని, వీనినిప్పుడొక యగ్నికంబమును కల్పించి దానికి గట్టి వేయుడు.

సేవ — (అట్లు సేయుచున్నారు)

ప్రహ్లా — శా॥ నీరేజాక్ష! సురారివైరి! విజితా ♦ నేక ప్రభావంత! వి
స్తారోదంచిత భక్తపాపశమనా! ♦ ధన్వంకరా! శంకరా!
శౌరీ! రూపజిత ప్రసూనశర! స ♦ త్సాంగత్య సంతుష్ట! ఓ
శ్రీరామాచ్యుత! వాసుదేవ! నినునే ♦ సేవింతు చింతామణీ

(20 - 3 అనుబంధము.)

దయామయా!

గీ॥ పాహి సర్వేశ మాంపాహి ♦ పాహి రక్ష
ఆపదోద్ధార! భక్తసం ♦ త్రాణశీల
సర్వజననతి సంస్తోత్ర! ♦ సర్వసాక్షి
మ్రొక్కెదను నీకు మొఱవిని ♦ చిక్కుదీర్ప॥

(20 - 4 అనుబంధము.)

గీ॥ నిత్యసత్యవ్రతుండనై ♦ నిలతు నేని
విష్ణుభక్తిని నెమ్మది ♦ విడువ నేని

దీన జనులను గావఁగాఁ ♦ బూనెదేని
శాంతిఁ బొందుము పావక ♦ సదయమతివి

(అగ్ని చల్లారును)

లీలా—నాథా! ఇఁకనైనఁ గరుణఁ జూడుఁడు. కడుపారఁ గన్న కుమారుని యిట్లు కష్టపెట్టుట భావ్యమా? వాని చర్యలద్భుతములుగ నున్నవి. మీ కేల దయరాదు. మీ పదములంటి వేఁడెద. పుత్రభిక్ష యొసఁగుఁడు

హిర—నా కేల మ్రొక్కెదవు. మంకుబుద్ధి మానుమని కుమారుని వేఁడుకొనుము. గురుపుత్రా! అగ్ని చల్లారె. కంటిరే యీచిత్రమును.

చండా—నాకును నాశ్చర్యముగనే యున్నది. వీనిని భయముచే దారికిఁ దీసుకొని రాఁజాలము. నయమున కొంతఁ జెప్పిచూచెద. (అని యేమో చెవులోఁ జెప్పును)

హిర—సరే! అట్లే చేయుము

చండా—ప్రహ్లాదా! రమ్ము. పోదము

(నిష్క్రమించుచున్నారు.)

## ద్వితీయరంము.

పాఠశాల

(ప్రవేశము చండామార్కులు, ప్రహ్లాదుఁడు, బాలకులు)

చండా—ఓరీ! ప్రహ్లాదా! ఇకనైన నా మాటలు విని జ్ఞానవంతుఁడవై హరినామ స్మరణ విడచి మా మర్యాద దక్కించుమా?



ప్రహ్లా—గురువర్యా! తండ్రిగారికిఁ బట్టిన పిచ్చియే మీకును బట్టెనా? బలగర్వాంధకారంబునఁ గన్నుఁగానక తండ్రిగారు స్వకులాభిమానమే ప్రధానముగాఁ గొని నన్నుఁ గంటగించినఁ గంటగించుదురుగాక! పసుగురకు నీతు లుపదేశించ తగిన యున్నత స్థానమున నుండిన మీకుఁ గూడ నిది యేమి వెఱ్ఱి? కేవలకుక్షింభరులై వచ్చు లాభంబునకు భంగంబు గలుగునని యిచ్చకంబులాడి యధికారుల మన్ననలందఁగోరు నీచసేవకులట్లు ప్రవర్తించిన లాభమేమి? ఇహలోక సౌఖ్యములకై బుద్ధిమంతులు నీతిదూరులై ప్రవర్తిల్లుదురే? అట్లయిన పశుపక్ష్యాది జంతువులకును మనకును భేదమేమి గలదు? జ్ఞానవంతులమైన మనకు ఫలము పంతముతో “నేఁ బట్టిన కుందేటికి మూఁడే కాళ్ళు” అనుటయా? పోనిండు. నా మాటనొకదాని నాలించి సదుత్తరమిత్తురేని నేనును మీ యిష్టానుసారము ప్రవర్తిల్లెద. తండ్రిగారి యాజ్ఞ మెయి నాకు విద్య గఱపుదురని బూనితిరి గదా? స్థిరబుద్ధి లేక నాకుఁ గ్రమముగ విద్యఁ గఱపనిచోఁ దల్లాభమునుఁ బొందఁదలుగుదురా? అట్లే ఏ కార్యమైన నొనర్ప యత్నించువాఁడందలి లాభాలాభములఁ గనుఁగొన యత్నింపక సద్దాని విడచి జన మేరయగునే? అందున నీ హరినామస్మరణ సామాన్యపు కార్యములవంటిదియా? ఆ మహాత్ముని దివ్య పాదారవిందములఁ జేరుటకు సాధ్యమగునా? దాని మహిమలు వర్ణింప నాతరమగునా?

చ॥ హరిహరియంచు నోటనని ♦ సంతన పాపము లెల్లఁబోయి సు
స్థిరమగు మోక్షసౌఖ్యములఁ ♦ జెందఁగవచ్చని కేలవ్యర్థులై
దురితముఁ బొందఁ జూచెదరు; ♦ ద్రోహపు కార్యము లెల్లఁ జేసి మీ

తెలుఁగరే? దానిసత్యమరయ నేటికివ్యర్థపుమాటలక్కటా ॥
నామాటలయందు మీకు నమ్మకము గలుగదేని
క॥ "హరియను రెండక్షరములు । హరియించును పాతకములు"

అనిచెప్పు పెద్దలనీతివాక్యములనుఁ దలఁచుకొన రాదా? సర్వమెఱిఁగిన మీకుఁ జెప్ప నేనెంతవాఁడను? ఏమో మీరును గనకకశ్యపుని క్రూరకార్యములకు జంకి యెఱుఁగనట్లు నటింపుచున్నారుగాని మీకుఁ దెలియక యా?

(21. అనుబంధము.)

కుట్రవాఁడుగదా యని నామాటలఁ ద్రోసివేయకుఁడు. స్థిరబుద్ధిని మీరే యోచించుఁడు

చండా—(స్వగ) అయ్యో! గ్రహచారము! వీనిమాటలు వినుచున్నకొలఁది నాకును మనోవైకల్యము గలుగుచున్నది. వీనిమాటలిట్లే వినుచున్న మతిభ్రష్టుఁడనగుట సత్యము. తనుపరి తినుచున్నకూటిలో మట్టిఁబోసుకొనుటయే గాక హిరణ్యకశ్యపునిచేతిలో ప్రహారణోత్సవంబులు తప్పక సిద్ధించును. ఇఁక నిక్కడనుండ రాదు. (ప్రకా) బాలకులారా! గృహంబునకేగి మరలివచ్చెద. అందాక నల్లరి సేయక మీమీ పాఠముల శ్రద్ధతోఁ జింతనఁ జేయుచుండుఁడి. (పోవుచున్నాఁడు.)

బాలు—ప్రహ్లాదా! అయ్యవారింటికేగిరి. వచ్చులోపల మనమాడుకొందమా?

ప్రహ్లా—ఆలాగే యాడుకొందము గాని యీయాటపాటలతో మనకేమిలాభము? ఇవియన్నియు వట్టినిష్ఫలములు. తుచ్ఛములు.

బాలు—పోనీ చదువుకొందమా?

ప్రహ్లా—అవియు నంతకంటె.



చ॥ గురువుల నారతంబు నెనఁ గూర్చెడు విద్యలు సారహీనమై
విరసములౌను సుమ్మి; యవివేకుల మాటను మోసపుచ్చి దా
కరుణఁ దొలంగి యీకరణిఁ గల్పనవిద్యలఁ జెప్పఁబూనె; నే
నెఱుఁగఁగఁ జెప్పెదన్ వినుఁడరే! యిపుడందఱు స్వస్థచిత్తులై

బాలు—అట్లనా? చెప్పుము. చెప్పుము.

ప్రహ్లా— తెల్పెద వినుఁడు. తొలుత భగవంతుని సృష్టియందలి మాయామయమగు నదీ ప్రపంచము. అట్టిమాయాగుణ ప్రధానమగు ప్రపంచములో మానుషజన్మము దొరకుట దుర్లభము. ఒకవేళఁ గాంచినను, యది శతవర్ష పరిమితంబై యుండును. ఆ శతవర్షములలో సగకాలము అంధకారమయమగు రాత్రికాలమున నిద్రాది ఫలహీన కార్యములచే నిండియుండి నిరర్థకంబై పోవును. తక్కిన సగభాగములో బాల్య, యౌవన కౌమారదశలలో కామ, క్రోధ, మద, మత్సరంబులను యరిషడ్వర్గములఁ జిక్కి క్రిందుమీఁదెఱుంగక తనయోగుబాగులను తెలుసుకొనఁజాలక యొక్కటేగతి నిది నాదియ నాదియని తపించుచుందురే గాని ముక్తిమార్గమునుఁ గనుఁగొనఁ జాలరు. తరువాత వార్ధిక్యంబున నేదియుఁ జేయఁజాలక స్మృతిహీనులై తనసంగతి తానెఱుంగక ప్రవర్తిల్లుచుండుటఁ గనుఁగొనుచుంటిమి గదా? పోనీ, యెట్లున్నను యీదేహము పరిమితకాలము వఱకైన స్థిరమందుమా? అట్లైన్నటికిఁ గాదు. మన జీవితకాలమును చక్రమతి వేగముగాఁ దిరుగుచుండుటచే నాయువు క్షణక్షణమునకుఁ దఱుగుచుండును. ఎప్పుడో యేవేళనో యీపాడుదేహము రాలిపోవును గాని యుండబోదు. లోకంబున ప్రతిప్రాణికోటికిని చావు దప్పదు. మాగినపండు రా

లకుండునా? కావున కాలము రాకమున్నే యేదయిన దారిజూఁచుకొనవలయునుగాని పిదప పశ్చాత్తాపపడి ప్రయోజనమేమి? అంతియగాక యీజీవితంబు, నీటిపైనిబిందువురీతి, అడుసులోని కుమ్మరపురుగుచందమున నుండునుగాన నిహసుఖములనంటి యంటకయుండ వలయునేగాని దురాశలకులోనై మోహంబులఁజిక్కిన భ్రష్టత్వము సిద్ధించును ఇట్టి యనిత్యాత్మకమైన శరీరమున కాశపడి తండ్రులనియు సతీసుతులనియు నొక్కమొగిని పరితపించుచుండుట కేవలము వెఱ్ఱితనము. నిజమువిచారించ నెక్కడిచుట్టములు, యెక్కడిబంధుగులు, యెక్కడిప్రేమ; పూర్వకర్మయోగమున

గీ॥ ఎక్కడెక్కడివారలో ♦ యొక్కచోట
కూడిభ్రమపడుచుందురు ♦ కొన్నినాళ్లు
వెళ్లిపోయెడువేళల ♦ వెంటరారు
యేటబడివచ్చుకట్టెల ♦ సాటిగాను.

జనులు పిచ్చివారై నిజమును గనుఁగొనలేక

ఉ॥ "తల్లియుదండ్రియన్నలును ♦ దమ్ములుజుట్టలుమిత్రులం"చు వా
ముల్లమునందునెంచుచుదు ♦ రూహలఁజేతురుముందునెవ్వరో
తొల్లిటనెవ్వరోగనరు ♦ దుర్మదులై; నిజమెంచిచూడఁగా
నెల్లశరీరధారులకు ♦ నెవ్వరికెవ్వరులేరుగాభువిన్.

కావుననిట్టి తుచ్ఛసంబంధములన్ గూర్చి పెల్లుగఁ జింతించక నావైకుంఠేశుని యందుమనస్సు నిల్పుటయే మంచికార్యము. అతఁడునిర్వికారుఁడు, నిర్వికల్పుఁడు, నిరామయుఁడు నిత్యుఁడు, సకలాంతర్యామి, భక్తజనసులభుఁడు, ముక్తిప్రదాత, పూతచారిత్రుఁడు, లోకారాధ్యుఁడు. అట్టి మహానుభావుని నమ్ముటకన్న మనకుయోగ్యంబగు కార్యములేదు. అన్నిఁటికతఁడే యాధారభూతుఁడు. ఆపరమాత్మునిసేవించనియెడల జన్మరాహిత్యముఁబొందుటయసత్యము. మనమిప్పటినుండియు జన్మరాహిత్యమై స్థిరమగు ముక్తికి వలయుప్రయత్నముఁ జేయకున్న నిట్లేమనపాపపుణ్యముల ననుసరించి యొక్కొక్క యోనినిఁ బుట్టుచుఁ జచ్చుచు నెన్నటికిని యెనలేనియిడుముల నొందవలసి వచ్చును. హరి జేరుట కెన్నియోమార్గములుండి యున్నవి. ఆమార్గము లేవియన



కం॥ తనుహృద్భాషల&c (అనుపూర్వోక్తపద్యము.)

బా — ప్రహ్లాదా! నీవుచెప్పినదంతయు సమంజసమేగాని కులాచారదైవంబగునా శంకరునినెందుకునారాధించి ముక్తిని నొందగూడదు.

ప్రహ్లా — బాలకులారా! మంచిప్రశ్ననిడితిరి. ఆలకింపుడు ఈలోకమున కంతకాహరియే యధినాథుఁడు. మనతండ్రిగారివద్ద నెందరెందఱో సేవకులుండి యొక్కొక్కకార్యమునందునియోగించఁబడిరి. ఆ నియోగులు వారి నియమితకార్యముల నేసమర్థించు కొనఁగలరు గాని యొక్కడు కార్యములఁజేయఁజాలుదురా? విద్యనపేక్షించుబాలుఁడుగురువులసేవించినవిద్యాఫలమునుఁ బొందగలుగునుగాని శిష్యులవేడిన లాభమును గాంచగలుగునే? అట్లేయన్నిటికధినాథుఁడగు వానిఁజేరక తదితరులఁ బ్రార్థించిన యశముదక్కునే? అతని యనుగ్రహమునుఁ బడసిన యామహాత్ముని యొద్దఁజేరఁగలుగుదుము.

చిల్లరదేవుళ్లను నమ్మిన నేమి? నమ్మకున్న నేమి?

బాల—ప్రహ్లాదా? నేఁడుమంచివిద్య నేర్పితివి. నీవుచెప్పినట్లు మనగురువులు నిజముగ క్రూరులేనుమీ? ఎన్నఁడు నిట్టిమేటివిద్య జెప్పలేదు దానినవలంభించు మార్గము మాకుపదేశించెదవా?

ప్రహ్లా—చెప్పెదనురండు. (అని చెవులో చెప్పును.)

బాల—ధన్యులమైతిమి.

ప్రహ్లా—బాలకులారా! మనమందఱ మావైకుంఠేశుని యాటపాటలఁ గీర్తించుదమా? తొల్లింటి మీయాటల యందలి వాంఛయును దీరును.

బాల—అట్లేకానిండు

ప్రహ్లా—కరతాళధ్వనులతో నేజెప్పినట్లుచెప్పుచుఁ నా వెనువెంటరండు.

[22 అను బంధము)

చండా—[ప్రవేశించి) ఇదియేమిగోల? ఈయాటలేమి? ఈపాటలేమి? ప్రహ్లాదుఁడు నాకొంపదీసినాడే [ప్రకా) బాలకులారా ఈగోలయేమి.

బాల—గురువుగారూ! బాగాయె. మీరేమోమంచిచదువు చెప్పెదమని నిస్సారములగు విద్యలాయింతవరకును జెప్పుచుంటిరి. చాలుచాలు యిఁక మీవిద్యమాకక్కరలేదు. ఈప్రహ్లాదుఁడుమాకుమంచివిద్యగఱపె. ఆయనయే మాకుగురువు. ఇఁక మీరో, "గురుగులు."

చండా—ప్రహ్లాదా! నానోటమట్టిగొట్టినావురా? తాఁజెడ్డకోతివనమెల్లఁజెఱచినసామ్య మయ్యెరా? చాలుచాలు ఇఁకఁజాలిఁదలఁపఁగూడదు. మీతండ్రిగారికిసర్వముని వేదించెదరమ్ము.

(అనిలాగుకొనిపోవుచున్నాఁడు)

# భక్త విజయము

## పంచమాంకము.

### ప్రథమరంగము.

(ప్రవేశము హిరణ్యకశ్యపుఁడు, లీలావతి.)

హిర—దేవీ! "తానొకటిఁదలఁప దైవమొకటి తలఁచు" ననుమాట యదార్థమేసుమీ? సుతులుసుతులని కలవరించి కలవరించి తుదకొక్కసుతునిఁగనియల్లారిముద్దుగఁబెనుచుకొనుచుండఁ బిట్టపిడుగుపడిన చందమున వానికట్టివిపరీతపుబుద్ధిపుట్టెనా? సోదరనాశనకరుఁడగు నాదుష్టహరిని మట్టుబెట్ట, నధికోత్సాహుఁడనై, ఘోరతపంబాచరించి, పితామహుని మెప్పించి, సాటిలేని మేటివరంబులనంది, వానికిఁదోడు పుత్రుని సాయమున దుర్వారశత్రుగర్వనిర్వాపణంబు సేయ సమకట్టిన నాకోరికలెల్ల మంటఁగలియఁబుత్రుఁడే వైరిదండఁజేరుటాయెనుగా? అకటా? దనుజవంశమున కంతకు రాజునై యుండియు, సాటివారలలోఁ దలవంపులు ఘటిల్లెఁగదా? "వైరినామోచ్చారణమే తగదని" యెన్నిరీతుల నయభయంబుల బోధించినను వినకుండుటయేగాక మీదుముక్కిలి నాకేయెదురాడఁజొచ్చెనే. ఎన్నిశ్రమలఁబెట్టినను వానికిలక్ష్యము లేదయ్యె.

అదియెంతమొండి జన్మమో తెలియరాదు ఇప్పుడీ కుమారు
నేమంచిదారికిఁ ద్రిప్పఁజాలకున్న, రేపాహరిని మాత్రమెట్లు
జయింపఁగలుగుదు

లీలా——ప్రాణేశ్వరా! పుత్రుని పైమీకు మాత్రమింతపంతమేల. ఏ
లలేనివ్యథఁదెచ్చిపెట్టుకొనెదరు

ఉ॥ పోడిమిలేక మీమదిని ♦ పొక్కెదరేల నిశాచరేంద్ర! యే
జాడవహించు దైవమటు ♦ సాగునుగాని విరుద్ధమెప్పుడే
కూడునె, మీకయో తెలియ ♦ కుండునె, యోడలు బండ్లనౌను, బం
డ్లోడలు నౌను కాలగతి ♦ నొందిచరింపఁదలంచ వేలనో॥

మఱియు నామనవి యొకటి యాలింపుడు

గీ॥ మంచికాలము నాఁడుమీ ♦ రంచితముగఁ
జేసియెన్నెన్ని కార్యముల్ ♦ వాసిగాంచి
నారు; దుష్కాల మిప్పుడా ♦ కారణమున
మంచిచెడ్డల మీమది ♦ నెంచవలదే ॥

హిర——తరుణీ! నీ బేలమాటలు చాలును. సహజశౌర్యధుర్యుండనైదా
నికిఁదోడు నాపరమేష్టి వరప్రసాది తలబ్ధప్రతాపానల మహి
మాతిశయుండనై యున్న నాకొక కాలము కాలమనియున్నదా?
కన్నకుమారుఁడిట్టులయ్యెఁగదాయనివిచారించుచుంటినిగాని

లీలా——అందునకే నేను వేడుకొనుట. నామనవి వేరొకటి యా
లింపుడు

హిర——ఆలింప వలసినదేమున్నది?

గీ॥ దుష్టులనుఁ బట్టినాతిరో! ♦ ద్రుంచువఱకు
నీదుముద్దులఁ జెల్లింప ♦ నేరసుమ్మి
గానవగఁదక్కి పొమ్మిఁకఁ ♦ గలికిమిన్న



లీలా—— అయ్యయో యిట్టి పంత మెం ♦ దైనఁగలదే ॥
మీరేదయఁజూడకున్న నా మొఱలాలించు వారెవ్వరు?

హిర——నీవంత మొఱలిడ వలసిన కార్యమేమి?

లీలా——కుమారునియందు దయఁగనుమనుటయే

హిర——అదియసంభవమే; నాయాజ్ఞోల్లంఘనఁజేసి నా వైరిపక్షమవ
లంబించినవాఁడు నాకుపుత్రుఁడెట్లయ్యె?

లీలా——నాథా! ఎట్లయినను గనిపెంచిన వాఁడుగదా? మీకుమా
త్రము జాలియుండవలదా?

హిర——ఉండెను. లాభమేమి, వాఁడేమైన తనుపట్టినపట్టువిడిచెనా?

లీలా——అట్లనిన భావ్యమే. (భర్తగారి పాదములపైఁబడికన్నీటితో)

సీ॥ నీగర్భమునఁ బుట్టి ♦ నీయంత వాఁడౌట
నీఘనంబెయని మ ♦ న్నింప వలదె?

హిర——సరే. నానితల్లినిగాదా నీవు? మీరుభయులు మంచిఘనము
నుదెచ్చిపెట్టుచుంటిరి?

లీలా——అధికమా ప్రేమను ♦ నాదరించెడు ముద్దు
తనయునిపై దయఁ ♦ దలఁపవలదె?

హిర——ఇంతవఱకు నట్లే యాదరించుట నీవెఱుఁగవా? తుదకేమ
య్యెనో తెలియదా?

లీలా——ఎఱిగి యెఱుంగకో ♦ యిట్టిబుద్ధినిఁగన్న
కొమరుఁ గరుణనుఁ ♦ గూర్ప వలదె?

హిర——తెలిసి తెలియకచేసెనా? సరే! తెలిపినందుకు వినరాదు?

లీలా——ఇరువు రెప్పుడు గల ♦ హించుచుండిన వైరి
చులకనగా మిమ్ముఁ ♦ జూడదయ్య

హిర——దేవి· అవాచ్యములగు మాటలాడకుము. ఆభీరుడావనలఁ

జులకనగాఁ జూచుట? ఇట్లనుటకు నీకేల సిగ్గుగల్గదు.

లీలా—గీ॥ వైరమూనుట సుతునితో ♦ వలపదయ్య

హిర—నాకుమాత్రమిష్టమా? వ్యవహారమిట్లుంచిననేమి సేయనగును

లీలా— పంతమూనుట మీకెంత ♦ భావ్యమయ్య

హిర—కాలానుసరణముగ నాకును బంతబుద్ధి కలిగినది

లీలా— కన్నపుత్రునిఁ గడగండ్ల ♦ కన్నులారఁ
గాంచజాలను కరుణతోఁ ♦ గావరయ్య ॥

హిర—చూడలేకున్న నంతిపురమునకుఁ బొమ్ము. నిన్నిచ్చటికెవ్వరు రమ్మనిరి?

లీలా—నాగర్భశోకమే నన్నుఁ దెచ్చె. నాప్రాప్తి యీరీతినుండ మీరేమి సేయఁగలరు.

హిర—లీలావతీ! అట్లే జెప్పకుము. వాఁడు నాయాజ్ఞ మెయి ప్రవర్తిల్లవలె. లేదా వానిపాట్లకు మితియే లేదని యెంచుకొనుము. నీమాటలవిని నిప్పుడూరకున్నచో

గీ॥ తత్పుత్రోవలఁ ద్రొక్కిన ♦ తనయు నేమి
జేసిరా రాజటంచును ♦ జేవగలిగి
యెల్లవారలు వారల ♦ కిష్టమైన
దారిఁద్రొక్కరె సర్వంబుఁ ♦ దగులఁబెట్టి ॥

అప్పుడు నారాజనామమేల? కాల్పనా?

లీలా—నాథా! రాజ్యంబులకై కన్నకొమరునిఁ గాల్చ చూచుట యెందైనఁగలదే? భుజశక్తియున్న రాజ్యమెందైనఁగలదు. ప్రజలును భీతిచే ప్రవర్తిల్లెదరు.

గీ॥ ధైర్యసాహస ముండిన ♦ ధరణియెల్ల
నేకరీతిగ నెల్లప్పు ♦ డేలవచ్చు



బుత్రుడీల్గినమతియొక ♦ పుత్రుఁడట్లు
కలుగఁగలడయ్య; మీకేల ♦ తెలియరాదో.

హిర—కాంతీ! నీయూహలెంతయు సరిగావు.

గీ॥ జగము నంతయు వెలిగించు ♦ చంద్రుఁ డొకఁడు
చాలఁడే? తారలున్నని ♦ ష్ఫలము గాదె
కులముఁ జెఱుపంగఁ జాలిన ♦ కొడుకు లేల
యున్న లేకున్న నొక్కటె ♦ యువిదమిన్న!

లీలా—అయిన నాప్రార్థనఁద్రోసివేసెదరా?

హిర—పుత్రుని నయభయంబుల దారికిఁ దెచ్చుట దప్పమతియేదైన సంతసమున జేయువాఁడ;

లీలా—బుద్ధులు చెప్పుఁడు. శ్రమల బెట్టకుఁడు.

హిర—సాధ్యముగాకున్న నేమి సేయనగు?

లీలా—అట్లయినఁ బదినెలలు మోసి, కని పెంచిన కొమారునిపై మోహముగూడ దొలఁగెనా?

హిర—ఇప్పుడు పోవుట యేమి? వాఁడెప్పుడు హరినామస్మరణఁ జేయుటకు మొదలిడెనో నాఁడే పోయినదని యెంచుము.

లీలా—అయ్యో! యెంత ప్రార్థించిన మీకుఁ గరుణ గలుగదాయె. నేనేమి సేయుదు.

(ప్రవేశము ప్రహ్లాదుఁడు, చండామార్కులు)

చండా—రాజా

గీ॥ "తాను చెడ్డకోతి ♦ తప్పక వనమెల్లఁ
బాడుఁ జేసె" నన్న ♦ పగిది గాను
పాఠశాలలోని ♦ బాలురనందఱి
నేటఁ గలిపినాఁడు ♦ లోటులేక.

నాచేతగాదబ్బా. మీరెట్లువీనిని దారికిఁదెచ్చెదరో! బహుక
ష్టసాధ్యమేసుమీ.

హిర—ఓరీప్రహ్లాదా! నీవుచెడుటయెగాక నందఱినిఁ గూడ పాడు
చేసితివా?

గీ॥ ఎన్నిరీతులఁదెల్పిన • నేలనీకు
బుద్ధిరాదురచండాల! • పొగరుబోత!
దనుజవంశమునంతయుఁ • దగులబెట్ట
బుట్టినాఁడవునాకడు • పునసుతునిగ.

ఓరీదుర్మదాంధ! కులద్రోహి!

గీ॥ పాపి!నీపినతండ్రినిఁ • బందిరూప
ముననుజంపిననీచుని • మూర్ఖబుద్ధిఁ
జంపయత్నించుటకుమాఱు • స్మరణఁజేయ
సిగ్గులేదుర!నీబుద్ధి • బుగ్గిగాను.

ప్రహ్లా—ఒకరి నొకరు జంపగలరా? ఎవరిపాపకర్మమే వారలను
జంపును. చిన్నాయనగారి ద్రోహబుద్ధియే కిటిరూపంబున
వానిని వధియించియుండెనేమోగాని హరికొకరిపై క్రూ
రబుద్ధియు నొకరిపై సన్మార్గబుద్ధియు గలఁదా? నన్ను జంప
మీరెన్నియోకార్యము లొనరించితిరి. ఫలముండెనా?

హిర—ఏమీ? మేముపాపులము? నీవుపుణ్యవంతుఁడవునా? నీపుణ్యా
మెట్లక్కఱకువచ్చునోచూచెదనుగాక? గురుపుత్రా! ఇంతకు
జాలినవాఁడు రేపువైరితో నేకమయినన్నుఁ గూడజంపనుం
కించును. వీనినెంత శీఘ్రమున మట్టుబెట్టిన నంతమేలగును.

చండా—అయ్యా! బజారమున నొక్కపాములవానినిజూచితిని. వాని
యొద్దగొప్పగొప్ప విషసర్పములున్నవి. వానిచేగఱిపించిన దప్పు



కచచ్చును. అప్పటికిఁజావకున్న (అనిచెవులోనేమొచెప్పును.]

హిర—సరే. హోమము చేసిశక్తినిపుట్టించు నీప్రయత్నమునసీత్రం
డుము. పాములవానినిందుఁబంపుము.

చండా—చిత్తము. [అనివెళ్లును]

హిర—ఓరీప్రహ్లాదా! వంశనాశనమూలధారా!

క॥ విడువుమురాహరిభక్తినిఁ
జెడెదవునామాటవినుము • చిన్నతనంపుఁ
మిడుకులు సేయఁగనేలర
బుడుతా! యికనైనమంకు • బుద్ధినివిడరా.

ప్రహ్లా—తండ్రీ! మాటిమాటికీ బెదరింపులేల.

గీ॥ దైవవిధినెవ్వరైనను • దాటఁగలరె
చెడెడుకాలముదాపింపఁ • జెడకయుండు
వారలుందురె? నాకేమి • భయములేదు
చెడినఁజెడనిమ్ము హరిభక్తి • విడువనొల్ల.

(ప్రవేశము పాములవాఁడు.)

(24 అనుబంధము.)

బాబయ్యో దండాలు దండాలు సామీ నన్నేలపిలిచినారు.
నాయాటసూడండి దేవా, బల్ తమాసాగా నాడిస్తాను.

హిర—ఓరీ! నీవద్దనేవి పాములున్నవి.

పాము—దేవరో (పాములపెట్టెఁదీయుచు) సామీ! ఇల్లిది అనాడు
మనకుచ్చింబరెడ్డు గారి పెరటిలో మల్లెపందిరికింద చుసా
చనకు కమ్మగనట్టి సొమ్ముచిల్లిపంచుకొన్న మల్లినాగు. దీని
కోరలు పీకేసినాను గాని యిప్పుడిప్పుడే మొలకలెత్తినాయి
(వేరొకటిఁదీసి) ఇదికోడితాసు బాబు. దీనికి రోసంయెక్కా

లగాని ముక్కిరిదయిపోయింది. నడుముపూసలు విరిగినాయి (యింకొకటిఁదీసి) రారా బాబూ రా.(అనిఆటలాడించును) ఓయబ్బో కరవత్తున్నావా? సాలు సాలు దొరికి యెను ట నీవిద్దెగాలు సూపించి నాకేమైన సద్దిబువ్వ పెట్టించు. (అని] దేవరా! ఇదిల్లదే నిన్న మొన్న కొట్టప్ప కొండలో పట్టినకొండసెల. దీనివాసనతగిలిందంటేనా యేనుగలు పీనుగలయిపోతాయి. దీనికేమిగాని ఇల్లిది సూడండి మెఁగలిడొంకల్లోయుండే మిల్లాగు. ఇదిఅట్టెమమికి యిట్టెకరిచి.చిట్టచివరకు చెట్టెక్కి కూకుండిపొగచూస్తే నేగాని దీనిపొగరు దింపుకోదు. ఇంకాసానాయున్నాయి బాబూ.

హిర—ఓరీ!కొంచమాగుము. నీకొకపనిగల్పించెద. [బాలునితో) ఓరీ ప్రహ్లాదా! ఇంతటనైన బుద్ధిఁదెచ్చుకొని హరినామస్మరణ మానెదవా! లేదా

ప్రహ్లా—తండ్రీ! నేమానజాలను. నన్నుమీరేమి జేసిననుసరే.

గీ॥ ఇచ్చవచ్చినరీతి జే ♦ యింపుమయ్య
యెదురుమాటాడనయ్య నే ♦ బెదరనయ్య
హరినిస్మరియించుటనుదక్క ♦ యడ్డుఁజెప్ప
మీఁదుమాజ్ఞలకెందును ♦ మేదినీశ.

హిర—ముమ్మాటికిదియేప్రత్యుత్తరమా! అట్లయిన నోరీపాములవాఁడా! ఘోరంబగు క్రూరసర్పంబులచే నీబాలుఁడు నేలంగూలునట్లుగొంకక కరిపింపుము. నాపుత్రుండని మీరిసుమంతయు భీతినొందఁబోకుడు. మీకిదేయాజ్ఞ; అట్లుసేయరైతి రేని మీప్రాణంబులఁదీసెద.

పాము—ఇదేంటయ్యా! నా పానాలమీఁదికే తెచ్చినారు మీచేజక్కితి. పాపంగాని పున్యంగానీ సేయకతప్పదు. చేస్తానుగాని యీయనుయెందుకొకరిపించడం.



హిర—అదియంతయునీకేల? ముందు పనిగానిమ్ము.

పాము—నాకేమిలే? ఎట్లునుతప్పునా(అనికరిపించునుపాముచచ్చిపోవును.అపుడేడ్చుచు) బాబయో. నాకూట్లోదుమ్మడ్డది. ఈపిల్లాణ్ణిపిసికేయా. ఈడొంటినిండా యిసమే. పామేచచ్చింది (భయమభినయించి)అబ్బో.కరుత్తాడేమో!ఓరయ్యో! యీబాం దడు.

హిర—ఓరీ! ఇదియొకవింతకాదు

గీ॥ కులముఁజెరుపంగఁబుట్టిన ♦ కూళవీఁడు
తండ్రియాజ్ఞలజవదాటు ♦ జడుఁడుసుమ్మి
అట్టిఖలుపకుఁలువెల్ల ♦ నరయవిషము
గాకసుధయుండనోపునే? ♦ ప్రాకటముగ.

ఆరే ప్రహ్లాదా! నీదెంతమొండి ప్రాణమురా? అన్నివిధములఁ బ్రాణము విసికించుచున్నావు. గురుపుత్రుఁడు చెప్పినవిధమువగాని వంతమొందవు. సేవకా! త్వరగనేగి గురుపుత్రునితో హోమము చేసి శక్తిని బుట్టించి ప్రహ్లాదుని పైప్రయోగింపుమనుము.నాయాజ్ఞయైనదని చెప్పుము.డింభకా! ఇకనీదిక్కునుజూచుకొమ్ము.

కం॥ దిక్కులనన్నిటిఁ గెలిచితి
నెక్కుడునాకెదురుబల్క ♦ నోపడుగా;యీ
చక్కినిమారాడఁగనీ
కెక్కడిధైర్యంబుకా,యి ♦దెక్కడఁజెపుమా.

ప్రహ్లా—తండ్రీ!

కం॥ దిక్కేమి వేఱుగావలె
చక్రనిహారినామజపవి ♦ చారముదక్కన్
దక్కినదిక్కులు లెక్కయె
నిక్కము నా వాక్యము రజ ♦ నీచరసాలా!

[తెరలో] అరే దురాత్మ! బ్రాహ్మ దుష్టబుద్ధివై నాహరిభక్తుని పైకిఁ బంపుచుంటి వటరా? చూచు నిన్నేమి జేసెదనో? నా బారినుండి తప్పించుకొని నీవెందుఁ బోఁగలవు. (అని శక్తి తేఱుముకొనిరాఁగాఁ జండామార్కులు ప్రవేశించును.)

చండా—దేవా! రక్షింపు రక్షింపు. అయ్యవారినిఁ జేయఁబోయిన కోతియైయీమాటవినినంతన నాభరతమే పట్టింపవచ్చుచున్నది. నన్నీశక్తి బారినుండి యెట్లుతప్పించెదవో? బ్రాహ్మణుండను. నీవుపేక్షించిన బ్రహ్మహత్యాదోషము నీకుదప్పక వచ్చును.

హిర—గురుపుత్రా! అధైర్యమేల- రానిమ్ము. ఆశక్తి నిన్నేమి జేయునో చూతము.

శక్తి—(ప్రవేశించి) ఏడిరా దురాత్ముఁడు? హరిభక్తునిపైకి నన్ను బంపిన బ్రాహ్మణాధముఁడు. ఛీరీ! బ్రాహ్మణపశువా? ఈదురాత్ముని మఱుగుజొచ్చినంతనే నిన్ను విడుతుననుకొంటివా? నీకుఁ బ్రాణములపైఁ బ్రీతిగలదేని ప్రహ్లాదునిపాదములపైఁ బడుము. అతఁడే నిన్ను రక్షింప వలయుఁగాని వీరలచేఁగాదు.

చండా—ప్రహ్లాదా! నీసామర్థ్యమెఱుఁగక మోసపోతిని. అదియంతయుఁ దలఁపక బ్రాహ్మణునికిఁ బ్రాణదానమొసఁగి పుణ్యముఁగట్టుకొమ్ము

ప్రహ్లా—ఓ! మాయాస్వరూపిణీ ఆది! శక్తీ! (అని కేలుమోడ్చి)

గీ॥ శక్తియుక్తులనెఱుఁగక ♦ సాహసమునఁ
బాపకార్యంబుఁ జేసె నీ ♦ బ్రాహ్మణుండు;
ఐనసద్దాని నెంచక ♦ దీనుఁడయిన
నాదుగురుపునురక్షించు ♦ మోదమెసఁగ ॥



శక్తి—ప్రహ్లాదా! నీకతంబున నీవిప్రుని విడిచి పోవలసివచ్చె. సమయమునకు నీవిక్కడనుండఁబట్టి వీఁడదృష్టవంతుఁడాయె. మంచిది. నాకు సెలవుసంగుము. (అనిపోవును)

చండా—అబ్బా! పులినోటనుండి తప్పించుకొంటిని! మందబుద్ధినై పరమభాగవతోత్తముని పలుబాములఁ బెట్టిన పాపంబూరక పోవునా? ఇప్పటికిబుద్ధికిచాలును. (పోవుచున్నాఁడు)

హిర—శుంఠా!

కం॥ ప్రజ్ఞావంతులయినను మ
దాజ్ఞాతిక్రమణసేయ ♦ నడలుచునుండన్;
బ్రాజ్ఞునిచందంబున నా
యాజ్ఞను జవదాటిపోదు ♦ వాజీవముతోన్ ? ॥

అంతియగాక.

గీ॥ శ్రమలఁ బెట్టుచునున్నను ♦ జడియకుండఁ
జావునకునైనఁ దెగించి ♦ సాహసమున
విష్ణుభక్తిని నదలవు ♦ వెఱ్ఱివగుచు
నెచటనున్నాఁడు వాఁడిప్పుఁ ♦ డెఱుఁగఁ జెపుమ ॥

ప్రహ్లా—తండ్రీ! హరినిఁ గనుఁగొన మనకు శక్యమగునా?

గీ॥ అదియంతము లేనట్టి ♦ యధిపుఁడతఁడు
కోపతాపములుండని ♦ గుణుడతండు
శత్రుఁడను వాఁడు లేఁడ ♦ య్యజగతిలోన
వానికిప్పుడనరే పైన ♦ వశమతీశ ॥

హిర—ఓరీ భ్రష్టా! నీతిభ్రష్టులై మతిహీనులైనవారలు వానినొక
పెద్దఁజేసి కీర్తించినంతనే లోకంబు మెచ్చునటరా?

చ॥ "హరిహరి"యంచు నొక్కక్షణమైనను బాయకఁ గొల్చుచుండినన్
సరగున రాఁడదేమి నిను ♦ జాలిఁదలంపఁగఁ బోవఁడేమి నీ
చరితము లింతియయ్యెడిని ♦ సర్వదిగంతరుఁ డాజడుండు నా
కరణిని వాఁగు నిన్ను కడి ♦ కండలు గా నొనరించు వాఁడరా? ॥

ఆ హరి యెచట నుండు? నిన్నే గతి బ్రోచు?

ప్రహ్లా—ఆ మహాత్మున కొక్క తావు లేదు. ప్రపంచమే విష్ణుమయ
మని యెఱుఁగుడు.

హిర—ఛీ! కల్లరీ! యీ మాటలన్నియు వ్యర్థభాషణములే

ఉ॥ పందిగ వచ్చి నా యనుజు ♦ బట్టి వధించిన నాట నుండియున్
సందులు గొందులన్నియును ♦ చక్కఁగ నారయుచుంటిగాని నే
నుందును గాంచనైతి నఁట ♦ డెక్కడఁ గాంచిన నుండునంచు ఛీ
కందువ మాటలాడెదవ ♦ కల్లరి మాటలఁ బల్కఁ జెల్లునే

నిజముగ నా హరి యెందున్నాఁడో యెఱిఁగింపుము;

ప్రహ్లా—తండ్రీ! ఎచట నున్నాఁడని పలుమాఱడుగ నేల? సర్వమయున
కునికి యామిక స్థలము ఉండునా? అతఁ డెల్లచోట్ల నిండియున్నాఁడు
నిశ్చయము. యదార్థము. సత్యము.

హిర—ఏమిరా! యెల్లతావుల నుండుననుట నిశ్చయమా? అట్లయిన
నే కోరిన స్థలముల జూపఁగలవా?

గీ॥ జడుఁడ! యిప్పుడే యీ సభా ♦ స్థలిని యున్న
స్తంభమందునఁ జూపుమా ♦ సరిగ వాని

ప్రహ్లా— విశ్వమంతయు నిండిన ♦ విష్ణుమాయ
స్తంభమున గూడ నుండు ని ♦ శ్చయము తండ్రి ॥



హిర—ఓరీ! నిశ్చయముగాఁ జూపఁగలవా? చూపలేకున్న నిన్నే
మి చేయుమనెదవు.

ప్రహ్లా—తండ్రీ! మీ రేమి జేసిన వలదంటినే? మీకు సిక్కఁబుగ నా
హరినిఁ గనుఁగొన మక్కువయున్న యీ స్తంభమున నుండి
మీకు దర్శనమిచ్చునని యే నా నమ్మకము. స్థిరభక్తిని ప్రార్థిం
పుము.

హిర—ఏమీ! నేనా పాపము బోతును ప్రార్థింపవలయునుగా? ఏమిరా
నీకండక్రొవ్వు. నాకోరినట్లు హరినిఁ జూపెదవా లేదా?

ప్రహ్లా—మీ రే జూడుడు. (చేతులు మోడ్చి)

చ॥ పరమదయాకరా! ధనుజ ♦ భంజన! శ్రీహరి! పద్మనాభ! సు
స్థిరమతి నీ వెదికఁనుచు ♦ సేవలొనర్చుచు నుండఁగా నిశా
చరవరుఁడీ సభాస్థలిని ♦ స్తంభమునందునఁ జూపుమంచు నన్
బరిపరిరీతులన్ శ్రమల ♦ పాలొనరించుచునుండెఁ గాంచుమా

గీ॥ గానవా యందుఁ బరిపూర్ణ ♦ కరుణఁగలిగి
రిక్తుఁ జేయక బ్రోవు స ♦ ద్భక్తపాల
కుండవను కీర్తి నిలుపుకో ♦ గోరజేని
స్తంభమున నుండి వెడలు ♦ సంరంభమునను ॥

(25 అను బంధము.)

హిర—ఏమిరా ప్రహ్లాదా! తడవు సేయుచుంటివి. చూపెదవా? లేదా?
(అని గదతో స్తంభమును గొట్ట నరసింహావతారము) ఓరీ! పు
త్రకా! నిన్ను మెచ్చవచ్చును. ఎంతకాలము నుండియో హ
రిరాకకై నిరీక్షించుచుండ దొంగయై చాటుమాటుల డాగి
యున్న నా వెంగలిని నాకంటఁబడ వేసితివి. (గదఁబూని) ఓ
రీ! ఎంతకాలమునకు నాకంటఁబడితివిరా? [ఇంకెచటికిఁ] బోఁగల

వు. మట ఖుల్లుజొచ్చిన కుండేలెండుఁబోఁగలదు.

నృసిం—ఒరే! దానవనాథమా! నీకుకాలమాసన్నమై యుండఁబట్టియే నాభక్తునిట్లు బాధింపదొడగితివి. ప్రహ్లాదుండన సామాన్యునిగాఁదలఁచితివిరా? (అని పట్టిచీల్చివేయును)

బ్రహ్మ—(అంతరిక్షమునుండి) ప్రహ్లాద భక్తాగ్రేసరా! రోషభీషణా యత్తచిత్తమైయున్న యీనరకేసరి యుగ్రదృష్టికిలోకంబులు భస్మీభూతంబులగుచున్నవి. నీవుదక్కితరన్యులు నామహామహుని శాంతిపఁజాలరు. వేగముగా శాంతిఁబొందించుము.

ప్రహ్లా—మహాత్ములారా! అభిమానముచే మీరందఱునన్నొక పెద్దజేసినారుగాని నాయందట్టిసమర్థతగలదా? అయినను మీయాజ్ఞానువర్తినై ప్రవర్తిల్లెద.

దండకము.

శ్రీమన్మహాదేవ! ప్రద్యుమ్న! గోవింద! రాత్రించరానీకసంహారదీక్షా! పయస్సాగరస్థా! సదాదీనసత్కార! సద్భక్తమందార! నీరేజనాభా! విశేషప్రభాశక్తి మంత్రాదిమధ్యాంతదూరా! హిరణ్యాక్షవిధ్వంస! సమ్యగ్జితానేకరక్షః ప్రకాండా! తదంభోధిజాతాదిసంస్తూయమానప్రభావా! నిరోధాతివీరప్రతాపా! సరోజాలయామానసాగార! తేసర్వదా నమస్తే, నమస్తే, నమస్తే నమః. శ్రీ. శ్రీ. శ్రీ.

నృసిం—ప్రహ్లాదా! నీభక్తికి మెచ్చితి. నిక్కంబుగ ముల్లోకములయందునునిన్ను మించినపరమభక్తుఁడుండఁబోడు. గాననేనీయిష్టముకైవడి స్తంభంబుననుద్భవించి లోకకంటకుండగు నీజనకునిమట్టుఁబెట్టితి.



ప్రహ్లా—భక్తవత్సలా? పూర్వకర్మయోగంబునఁజేసి నరులకు బుద్ధిపుట్టుచుండును. "బుద్ధిః కర్మానుసారిణి" యను వాక్యము లసత్యములగునా? కావుననే నాతండ్రికట్టిబుద్ధిపుట్టె. దానికిమీరేమిచేయుదురు.

నృసిం—భాగవతోత్తమా! చింతబాసినిర్భయుఁడవై యుండుము. నీయభీష్టంబులఁదెల్పుము.

ప్రహ్లా—దేవా! నాకెట్టివరములు వలదు. మీపదసాన్నిధ్యంబునఁజేర్చుకొనుటయె మేటివరంబులొసంగుట

నృసిం—ప్రహ్లాదా! ఇప్పుడేవలదు. లోకంబున నీవునర్పవలసిన కార్యంబులెన్నియోగలవు. అంతదనుక యోర్చుకొనుము. నీయభీష్టమునకు కొఱంతయుండఁబోదు.

ప్రహ్లా—దేవా! మీయాజ్ఞకు వ్యతిరేకము గలదా. అయిన నిట్లనుగ్రహింపుడు

గీ॥ ధరణిఁబ్రజలెల్ల విష్ణువే • దైవమనుచుఁ
దలఁచి వర్తింతురిగావుత • ధర్మపథముఁ
బాయకుండఁగ రాజులు • పాలనంబుఁ
జేసెదరుగాత వన్నియు • వాసిగలుగ॥

నృసిం—తథాస్తు. తథాస్తు.

(నిష్క్రమించుచున్నారు.)

మంగళంమహా శ్రీ శ్రీ శ్రీ

సంపూర్ణము.

# అనుబంధము



1అ. పేజీ 1 నాంది (రామనీసమానమెవరు) అనుధాటి

శ్రీపతేసురాదివందితా- శ్రితజనపరిపోషకా
భూపా, దనుజారితిలక - బుధజనపూజితసుగుణ శ్రీప
దినదినమునునిన్నే - దనరగానుదలచినే - వినుతిసేతు
పరాత్పరుడవీ - వనుచునెంచితినికృపాళు శ్రీప

---

2అ. పేజీ 24 లీలావతి కీర్తన

జీవితేశుడెందుజనెనో - జేరరాడేమొ
భావమునకు చింతగల్గెనా - కంతులేకను జీవి
ఘోరతపము జేతుననుచు - జేరివనముల
మరలరాడు ధీరుడయ్యో - దారియికేమొ జీవి
వైరబుద్ధిమానడకటా - హారితోపంతము
భారముయినకార్యమనుచు - నేరడాయెనో జీవి

---

3అ. పేజీ 30 లీలావతి (వరములొసగి బ్రోచుట)అనుధాటి

శరణు శరణు శంకరహే- కరుణాకరభీమేశ
దురితవినాశనవరదా - గరళకంఠశూలధారి
మదినినీదుధ్యానమె - ప్పుడును మరువకదలచెదనే
బుధజనపూజితసోమా - సదమలమతి బ్రోవనిదె

(అనుపల్లవి) వారిజనాభుని వర్ణించగానిల
సర్వసౌఖ్యములు - సర్వసంపదలు -నుర్విని గలుగును
సర్వసాక్షునిగన్న రిప
తరతరదుఃఖముల్ - తప్పకతొలగించి - తరుగని మోక్షము.
వరగుననొసగును ఎరి

---

9అ. పేజీ 64 సంవాదము (మూర్తివంత) అనుధాటి

లీలా- తండ్రియేలనిట్టిభ్రాంతి - తగదుతగదువీడుమా తండ్రి
ప్రహ్లా-అమ్మరోనాకేమిభ్రాంతి - గంటివమ్మజెప్పుమమ్మా అమ్మ
లీలా- తండ్రియాజ్ఞమీరనగున - తనయచింతజేయుమా తండ్రి
ప్రహ్లా-జనకుత్రోవనీవుగూడ - జనుటమేలెజననీ అమ్మ
లీలా- లేనిపోనివాదమేల - వినుముమాటనాయనా తండ్రి
ప్రహ్లా- వాదమేమిలేదుతల్లి -బాగుబాగుమీనుడీ అమ్మ

---

10అ. పేజీ 65 ప్రహ్లాదుడు హుసేనిరాగం రూపకతాళము

(పల్లవి) ఎన్నంగలేదుతల్లి - యెందు వెదకిచూచినాను
(అనుపల్లవి) పన్నగారివాహనుని - కన్నమిన్నదైవమిలను ఎన్న
ఆశ్రితవత్సలగుణనిధీ - వేదసారవారినిధీ - నాపదలనుదీర్చునిధీ
దయానిధీ - దయానిధీ ఎన్నం
సదయహృదనివాసుడు - కొదవలేని కోవిదుడు మదికి
ముదముగలుగువాని - పదిలముగను వెదకినభువి ఎన్నం

---



11అ. పేజీ ౬౬ లీలావతి సావేరిరాగం ఆటతాళము

(పల్లవి) ఏమరాడకుమురాతండ్రీ
(అనుపల్లవి) కెదురాడకుమురా
సదమలగుణరత్నాకరా - సర్వజ్ఞానప్రభాకరా
వదపడినీ జనకున - కెదురాడుటతగునా ఏదు
తల్లిదండ్రులకుఖేద - మేలబెట్టెదవురా - పిల్లవాడలాటమది
కల్లనిజముగనుగొనలేక ఏదు

12అ. పేజీ 67లీలావతి

న్యాయమేరజారచోర అనుధాటి

(పల్లవి) అయ్యోనీకువైరబుద్ధి - చాలురాసుత
(అనుపల్లవి) నెయ్యమూనను చాలదెల్పునా
మేలగుమాటలకా - గేలిసేజేసెదు అయ్యో
పొందుగ -నూ కులదైవమును గూర్చి చింతనసేయుమురా
డెందమందున సంతసమొందెదు - రీతినివేగమె
సుందరవదనా అయ్యో

---

13అ. పేజీ 67 ప్రహ్లాదుడు కన్నడరాగం రూపకతాళము

(పల్లవి) కలడే తల్లీ కులదైవంబనుచునొకడు
(అనుపల్లవి)పలుమారిటు భావించుట- పాడిగాదువినుముజననీ- కల

ఎల్లలోకములకు నొకడె - నెందునవాడుండువాడె
కల్లగాదు వినుము విష్ణు - కన్న జగము వేరె లేదు! కల
ఆదిమూర్తి యతడెసుమ్మీ - భేదబుద్ధి లేదు నమ్మ
వాదులాడ తగదు పొమ్మ - మాధవుడే సర్వమమ్మ! కల

---

14అ. పేజీ 63 ప్రహ్లాదుడు కీర్తన

(పల్లవి) నమ్మజాలనె పెరదైవంబులా నేను
(అనుపల్లవి) నమ్మతి గనా - నెమ్మదిలోన
నమ్మితి శ్రీహరి పదమమ్మ మాయమ్మ నమ్మ
పన్నగధీశుని భక్త శరణ్యుని
పాపవిదూరుని - పావననాముని కన్న నెరుల! నమ్మ

---

15అ. పేజీ 68 లీలావతి

ఆనందభైరవి రాగము - ఆదితాళము
పతియే దైవము గాదె - సుతులకు
సతతంబు మారాడ తగునా! పతి
సుతుడా - మానుము బుద్ధి - హితమున
మతియేమొ నామాట వినవూ పతి

---

16అ. పేజీ 69 లీలావతి కీర్తన

అయ్యోతన - యిటు జేసెడి - నీగతి - కేనేమందునురా



ఈరీతి నీవయ్యో - వేమారు జెప్పిన - వారిజనాభుని
స్మరణను మానవు! అయ్యో
క్రూరతనీతండ్రి - కార్యము గాని - క్రూరదండన జేయ
జూచుచునుండెర! అయ్యో

---

17అ. పేజీ 76 ప్రహ్లాదుడు

కమాచి రాగము - ఆదితాళము
శ్రీహరి భజనసమానమేదయ్యా - చిత్తమందున
దలచిచూడ శ్రీహ
ఇహపరములకు నింపగు మార్గము పలుదురితముల
నణచగలిగిన సాధన, గావున మానగ తరమటె శ్రీహ

---

18అ. పేజీ 79 ప్రహ్లాదుడు

సావేరి రాగము - రూపకతాళము
(పల్లవి) ఆశలేదు ప్రాణమందున - ఓతండ్రీ
(అనుపల్లవి) ప్రాణమందు నాశగల - పామరునకుండుగాని
నాకదేమిటికే - నాతండ్రి వినుమా! ఆశ
మలమూత్రముల కెంతో - నిలయమైన పాడుబొంద
తలచినంత నెంతో వింత - వలపు జెంద నేలయింత
పలుకులికేటికే - నాతండ్రీ వినుమా! ఆశ

---

19అ. పేజీ 79 లీలావతి కీర్తన

ప్రాణనాథవినుమా - మనవి - గైకొనుమ
యీలీలపుత్రుని శ్రమల - పాలుజేయ భావ్యమ   ప్రాణ
కన్నవానికడగండ్ల - కనులారజూడజాల
నాగ్రహంబునొందకుండ - నయమునబుద్ధిజెప్పుడీ   ప్రాణ

---

20అ. పేజీ 80 ప్రహ్లాదుడు కీర్తన

అహోకరుణగనుమయ్యా - పరమపురుషా దురితహరణా
1. వేదచోరవిగతజీవన - మాధవా శ్రీ భక్తపాలన
వేదపురుషా దేవవందిత - దయనుబ్రోవర - దానవారి   అహో
2. మందరాద్రిధారిహృదయా - నందకారణమోక్షసాధన
వందనంబిదెసుందరాంగా - పద్మనాభా - భవ్యచరిత   అహో
3. క్రూరబుద్ధిని దానవుండతి - ఘోరదండనజేయుచుండెను
నోర్వజాలను మేరుధీరా - వేరుదిక్కికలేదుగదరా   అహో
4. నీదుభక్తినివిడువనేని - బేధబుద్ధిసెకలుగదే
నాదరంబుననన్నుగావర - శ్రీధరాసుర - సేవితానుత   అహో

---

21.అ పేజీ 84 ప్రహ్లాదుడు

(అమ్మమ్మనీమాటల అనునట్లు)
గురువర్యసత్యమరసిజూడుడీ
అరసిజూడుడీనా - మొరలువినుడీ   గురు



పద్మనాభు పూజభక్తి జేయుడీ,
భక్తిజేయుడీయా - ముక్తిగాంచుడీ।   గురు
వంతబుద్ధియేల - చింతచేయుడీ
చింతజేయుడీ మీా - వంతబాయుడీ   గురు

---

22అ. పేజీ 88 ప్రహ్లాదుడు (మోడిసేయగానింత) అనుఘాటి

భజనజేతాము రారె - పద్మనాభునిగూర్చి
అందరమా-నందమిం-పొందంగ-సుందరంబుగ।   భజ
వారిజాక్షునినామ - స్మరణనేమారకెపుడు
నేర్పుగా - నోర్పుతో - కూర్పుడి-మోదమందగ   భజ
భక్తవత్సలుడగుట - పాపవిదూరుడగుట
శ్రీపతి - కాపాడు - నేపాప - మొందకుండగ   భజ

---

23అ. పేజీ 95 పాములవాడు కీర్తన

పాములాడినయ్యా నా - పట్టజూడరయ్యా
పాములెన్నొగలవు మీా - పాదమానగనుడీ।   పాము
అంకాళమ్మపొచ్చిరయే - శంకలేనుదొరలు
యెంకిగాడుగూడనా - వంకజూడలేడు।   పాము
విద్దగాలుసూచీ - సద్దీబెట్టరయ్యా
బుద్దిబుద్దిదొరలు మా - పెద్దిగాడు జోడు।   పాము

---

24అ. పేజీ 101 ప్రహ్లాదుఁడు (అంబాభాగ్యదాయనీ) అనుధాటి

కామితార్థవరదా - కరుణాకర - కరుణించర - నను వేగమె
సరసీరుహదళనయనా, పరమపురుష, కృపాళూ
దీనపోషక బ్రోవుమయ్య జాలమేలభవ్యచరిత కామి
సురసేవితననునక్కట సరగునదనుజుండూ స్తంభమందు
జూపగోరె - నిండియుండు మయ్యయటుల కామి

## శుద్ధపత్రిక.

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1. | 23 | మారీ | మారి |
| 2. | 6 | మారీ | మారి |
| | ,, | పశ్చాత్తావమున | పశ్చాత్తాపమున |
| | 10 | కోపమునజెడును | కోపముఁజెడును |
| 3 | 21 | విదాధిక్యత | విద్యాధిక్యత |
| 7 | 10 | చిత్తుఁడ్తై | చిత్తుఁడై |
| 9 | 2 | సొమ్ములతీసి | సొమ్ములఁదీసి |
| 16 | 21 | నాకీగతి | నాకీజగతి |
| 24 | 19 | నాథుడు | నాథుఁడు |
| 25 | 19 | దారుణి | ధారుణి |
| | 21 | నేమనందునా | నేమనందునో |
| 25 | 24 | గావవేపరమేశ్వరా | గావఁగాపరమేశ్వరా |
| 28 | 6 | కుహేంద్రనాముఁడక | మహేంద్రనాముఁడక |
| | 20 | పీసులఁబటికొట్టి | పీరులఁబట్టికొట్టి |
| 30 | 17 | బ్రోవవెచింతదీర్పరే | బ్రోవవెచింతఁదీర్పవే |
| 34 | 9 | బనుప“నాకాజ్ఞా | బనుపు“మనినాకాజ్ఞ |
| 37 | 6 | నంతరదుః ఖార్త | సంతరదుఃఖార్త |
| 46 | 1 | గర్భము నినర | గర్భమునసర్భ |
| 56 | 5 | పహ | ప్రహ్లా |
| | 10 | ప్రహు | ప్రహ్లా |
| 65 | 24 | ఏలుకల | ఎలుకల |

| | | | |
|---|---|---|---|
| 80 | 8 | దామోద | దామోదర |
| 80 | 15 | నాకుండివ | నాకుండిన |
| 82 | 17 | ద్వితీయరంము | ద్వితీయరంగము |
| 95 | 16 | (24 అనుబంధము) | (23అనుబంధము) |
| 100 | 13 | నుండును | నెందును |
| | ” | నతడెక్కడగాంచినసుండుః | “నతడెక్కడగాంచినసుండుః |
| 101 | 18 | (25 అనుబంధము) | (24 అనుబంధము) |

☞ అసాధ్యములు వదలినాడగాన జదువరులు నాయందుకృపాళులరై మన్నింతుగారుక.



For copies apply to:-

M. KUTUMBARAYA SARMA,
Narasarowpet

Or,

M. GURUBRAMHA SARMA GARU,
Cleark, Taluq Office,
Narasarowpet

